# విజ్ఞప్తి.

పాఠకమహాశయులారా!

నాకీ నాటకమును రచింపవలెనను కోరిక చాల కాలముక్రిందటనే జనించినది. కాని కార్యాంతరములచే నయ్యది కొనసాగదయ్యె. గతసంవత్సరము నాయాప్తులలోఁ గొందఱీ నాటకమును వ్రాయుటకు నన్నుఁ బ్రోత్సహించినందున సుమారొక మాసము కాలములోనే దీనిని ముగింపఁగల్గితిని. కాని ద్రవ్యలోపముచేఁ బ్రచురింప వలనుపడదయ్యె. నేఁటికి మన్మిత్రులును సుబోధిని గ్రంథమాలాధ్యక్షులును నగు మ. రా. రా. శ్రీ. శొంఠి వేంకటాచలదాసుగారాహ్వానపురస్సరముగా నీ నాటకమును వారి గ్రంథమాలయందుఁ బ్రచురింపఁ గడంగినందులకు వారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. నాకీ రచనకుఁ గడంగుటకిదియే ప్రథమంబుగాన నిందలి దోషంబుల మన్నింపఁ బండితవర్యుల బద్ధాంజలి పూర్వకంబుగా వేఁడుచున్నాఁడను.

చల్లపల్లి,
...—1924.

ఇట్లు,
భవదీయ విధేయుఁడు,
కొ[illegible] వేంకటశాస్త్రి.

ఉ. నాటకముల్ రచించుటకు ♦ నాకు నిదే ప్రథమంబటంచు ముందా
గాటపుస్మృతి నివ్వటిలఁ ♦ గన్గొను నాటకమున్ రచించినే
లోటునులేక యుండదన ♦ లోకమునం దొనరించి [illegible]
డ్డాటయినట్టి సూరికవి ♦ వర్యునకెంతయు నేఁ గృతజ్ఞుఁడన్.

ఇట్లు,
గ్రంథకర్త.

# సుబోధినీ గ్రంథనిలయము, తెనాలి.

ప్రధానపోషకులు.

| | |
|---|---|
| మ. రా. రా. శ్రీ. సంకాపీరి భద్రయ్య శ్రేష్ఠిగారు. | తెనాలి. |
| ,, కొమ్మూరు చినహనుమంతరావు శ్రేష్ఠిగారు. | ,, |
| ,, పెద్దిభొట్ల రామయ్యగారు. | ,, |
| ,, పిల్లలమఱ్ఱి సోమయాజులుగారు. | ,, |
| ,, మారౌతు కోటయ్య చౌదరిగారు. | పేరకలపూడి. |
| ,, వాసిరెడ్డి కోటయ్య చౌదరిగారు. | చిన్నపాలెం. |
| ,, కన్నెగంటి వెంకట్రావుచౌదరిగారు. | నందివెలుగు. |
| ,, గవిని శాయన్న చౌదరిగారు. | జంపని. |
| ,, చదలవాడ వుమామహేశ్వరరావు చౌదరిగారు. | పెదపూడి. |
| ,, సుంకర పున్నారాయుడుచౌదరిగారు. | పల్లెకోన. |

పోషకులు.

| | |
|---|---|
| మ. రా. రా. శ్రీ. కామిశెట్టి వేంకటస్వామినాయుడుగారు. | తెనాలి. |
| ,, మండవ రామమూర్తి శ్రేష్ఠిగారు. | ,, |
| ,, మునగాల కామయ్య శ్రేష్ఠిగారు. | ,, |
| ,, మునగాల చిన్నసాంబయ్య శ్రేష్ఠిగారు. | ,, |
| ,, మునగాల పెదసాంబయ్య శ్రేష్ఠిగారు. | ,, |
| ,, గు. దొబ్బల కుమారస్వామినాయుడుగారు. | ,, |
| ,, అనుగోలు నర్సయ్యనాయుడుగారు. | ,, |
| ,, భమిడిపాటి వేంకటరమణయ్యగారు. | ,, |
| ,, గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు. | ,, |
| ,, పసుపులేటి తాండవకృష్ణయ్యనాయుడుగారు. | గుంటూరు. |
| ,, కాకుమాను పుల్లక్కగారు. | తెనాలి. |
| ,, గోపిదరాజుల వేంకటసుబ్బారావుగారు. | ,, |
| ,, వి. వి. రాఘవాచార్యులుగారు. | ఉప్పలూరు. |
| ,, నేమూరి బక్కరామయ్య నాయుడుగారు. పోలీసుడిపార్టుమెంటు | తెనాలి. |

# సంపాదకీయ భూమిక.

పాఠకమహాశయులారా!

ఈ మారుతీవిజయమును నాటకరూపమున విరచించి సర్వస్వామ్య సంకలితముగ మాగ్రంథమాల కొసంగి మాయుద్యమమునకుఁ దోడ్పడిన శ్రీయుత. కోపల్లె వేంకటరత్నకవిగారికి మాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము.

ఇట్లు,
సంపాదకుఁడు.

---

## ఈనాటకమందు వచ్చు పాత్రలు.

### పురుషులు.

ఆంజనేయుఁడు—కథానాయకుఁడు.

రావణుఁడు—రాక్షసప్రభువు. (లంకాధినాథుఁడు)

సారణుఁడు—రావణునిచారుఁడు.

మైరావణుఁడు—పాతాళలంకానాథుఁడు. (రాక్షసప్రభువు)

శ్రీరాముఁడు—అయోధ్యాధిపతి.

లక్ష్మణుఁడు—రామునితమ్ముఁడు.

సుగ్రీవుఁడు—వానరప్రభువు. (కిష్కింధాధిపతి)

విభీషణుఁడు—రావణునితమ్ముఁడు.

దీర్ఘనాసికుఁడు— } మైరావణుని భటులు.
వక్రదంతుఁడు— }

సుచన్ద్రకుఁడు— } మైరావణుని మంత్రులు.
వ్యాఘ్రదత్తుఁడు— }

సుమతి—మైరావణుని చెల్లెలికొడుకు.

పంచజనుఁడు—మైరావణుని సేవకుఁడు.

### స్త్రీలు.

మదనమాలిని—మైరావణుని భార్య.

కుందలతిక— } మదనమాలిని చెలికత్తెలు.
మనోరమ— }

దుర్దండి—మైరావణుని చెల్లెలు.

ఇంకను కొందఱుభటులు మొదలగువారు వత్తురు.



శ్రీ

# మారుతి విజయము.



( నాంది )

ఉ. శ్రీరమణీయమై భువిని ♦ జెన్నగు సర్వకులాగ్రవంశమునన్
సారసగర్భపార్థివసను ♦ సాధుహితంబొనర్పఁ బుట్టి సీ
తారమణిన్ వివాహమయి ♦ దానవులన్ వధియించి భూసతీ
భారముమాపి భక్తులను ♦ బాలనఁ జేసెడి రాముఁ గోముతన్.

(నాంద్యంత్యంబున సూత్రధారుండు ప్రవేశించి)

సూత్ర — సౌందర్యజితరతీవధూటీ! నటీ! నీయలంకారము పూర్తి యైనచో నొక్కసారి యిటు రాగలవా?

నటి — (ప్రవేశించి) నాథా! ఏమి సెలవు?

సూత్ర — సఖీ! సకలవిద్వజ్జన పరిశోభితంబగు నీసభను దిలకించితివా! మనమేమో తిమ్మలరంగముమను గొండంతయాశతో నిచ్చటికి విచ్చేసిన వీరి నేనాటకమాడి సంతసింపఁజేయుదగునా యని యోజించుచుంటిని.

నటి — నాథా! ఈకాలంబున నాటకంబులకై వెదకికొనవలెనా? ఏయింటఁ జూచినను గవ్వలే ఎచ్చటఁ జూచినను నాటకంబులే!

# సంపాదకీయ భూమిక.

పాఠకమహాశయులారా!

ఈ మారుతీవిజయమును నాటకరూపమున విరచించి సర్వస్వామ్య సంకలితముగ మా గ్రంథమాల కొసంగి మా యుద్యమమునకుఁ దోడ్పడిన శ్రీయుత. కోపల్లె వేంకటరత్నకవిగారికి మా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము.

ఇట్లు,
సంపాదకుఁడు.

---

## ఈనాటకమందు వచ్చు పాత్రలు.

### పురుషులు.

ఆంజనేయుఁడు—కథానాయకుఁడు.

రావణుఁడు—రాక్షసప్రభువు. (లంకాధినాథుఁడు)

నారదుఁడు—రావణునిచారుఁడు.

మైరావణుఁడు—పాతాళలంకాధీశుఁడు. (రాక్షసప్రభువు)

శ్రీరాముఁడు—అయోధ్యాధిపతి.

లక్ష్మణుఁడు—రామునితమ్ముఁడు.

సుగ్రీవుఁడు—వానరప్రభువు. (కిష్కింధాధిపతి)

విభీషణుఁడు—రావణునితమ్ముఁడు.

దీర్ఘనాసికుఁడు—
వక్రదంతుఁడు— } మైరావణుని భటులు.

సుచన్ద్రకుఁడు—
వ్యాఘ్రదత్తుఁడు— } మైరావణుని మంత్రులు.

సుమతి—మైరావణుని చెల్లెలికొడుకు.

పంచజనుఁడు—మైరావణుని సేవకుఁడు.

### స్త్రీలు.

మదనమాలిని—మైరావణుని భార్య.

కుందలతిక—
మనోరమ— } మదనమాలిని చెలికత్తెలు.

దోర్దండి—మైరావణుని చెల్లెలు.

ఇంకను కొందఱుభటులు మొదలగువారు వస్తురు.



శ్రీ

# మారుతి విజయము.



( నాంది )

ఉ. శ్రీరమణీయమై భువిని ♦ జెన్నగు నర్కకులాన్వయంబునన్
పారసగర్భవార్ధి సను ♦ సాధుహితంబొనరింపఁబుట్టి సీ
తారమణిన్ వివాహమయి ♦ దానవులన్ వధియించి భూసతీ
భారమువాపి భక్తులను ♦ బాలనఁజేసెడి రాముఁ గొల్తున్.

(నాంద్యంతంబున సూత్రధారుండు ప్రవేశించి)

సూత్ర—సౌందర్యజితరంభావధూటీ! నటీ! నీయలంకారము పూర్తియైనచో నొకసారి యిటు రాగలవా?

నటి—(ప్రవేశించి) నాథా! ఏమి సెలవు!

సూత్ర—సఖీ! సకలవిద్వజ్జనపరిశోభితంబగు నీసభను వీక్షించితివా! మనమేమో తిమ్మలరాయమను గొండంతయాశతో నిచ్చటికి విచ్చేసిన వీరి నేనాటకమాడి సంతసింపఁజేయనగునా యని యోజించుచుంటిని.

నటి—నాథా! ఈకాలంబున నాటకంబులకై వెదకికొనవలెనా? ఏయింటఁ జూచినను గవులే యెచ్చటఁజూచినను నాటకంబులే!

సూత్ర—అవునుకాని యీసదస్యుల నలరించుట కేదేని క్రొత్తనాటక మొకటుండిన బాగుండును.

నటి—క్రొత్తనాటకములకుమాత్ర మేమి కొదువ.

సూత్ర—అట్లుగాదు. అయ్యాది పౌరాణిక సంబంధమైన క్రొత్తనాటకమని నాయభిప్రాయము.

నటి—అట్లయిన మొన్నటిదినంబున నీకేదియో క్రొత్త నాటకమును జరుపుచుంటిరి! ఆనాటకమైన బాగుండునా?

సూత్ర—(దృష్టి నభినయించి) ఓహోహో! హనుమద్విజయము మాటయేనా?

నటి—అవును.

సూత్ర—మంచినాటకమును జ్ఞప్తికి దెచ్చితివి. ప్రస్తుతమందిది మిక్కిలి యుపకరించును.

నటి—అట్లయిన దానిలోనికథ యేమి!

సూత్ర—ఆంజనేయుని వైరాగ్యమును వర్ణించును.

నటి—ఇది యేపురాణములోనిది!

సూత్ర—ఇది యేపురాణమందును నున్నట్లు గాన్పింపదు గాని కొన్ని పురాణగాథలవలె నిదియు జనసామాన్యంబునం బరిచితమైనది. దీనినే బ్రాహ్మణసిద్ధాంతుఁడగు మారయకవి ప్రబంధ రూపమున రచియించెను.

నటి—దీని నిదివఱ కెవ్వరైన నాటకరూపంబుగ రచియించి యుండిరో లేదా!

సూత్ర—ఇదివర కెవ్వరును రచియించినట్లు కనుపింపదు. ఏది యెట్లున్నను యాజన్మబ్రహ్మచర్యవ్రతానుష్ఠానగరిష్ఠుండును,

భక్తాగ్రేసరుండును, భవిష్యద్బ్రహ్మయుఁ, గేవల భగవత్సదృశుఁడుగ నెంచి పూజింపఁబడు శ్రీయాంజనేయుని చరితమగుటవలనను, యిది గయోపాఖ్యానాది కథలవలె జనసామాన్యమున వెలసిన కథయైయుండియు నాటకరూపంబుఁ దాల్చుట కిదియే ప్రథమమగుటచేతను ప్రేక్షకుల నుల్లాసపఱచు ననియే నాయభిప్రాయము.

నటి—సరే! ఇంతకును దీని రచియించిన కవి యెవరు?

సూత్ర—ఇదిగో చెప్పెద వినుము.

సీ. దివ్యతారకమాత్ర ♦ దీక్షాపరుండు వేం
కటరత్ననాముఁ డే ♦ ఘనుని తాత
సదయుండు సద్బ్రహ్మ ♦ చారియా రాయనా
భిఖ్యుఁ డేసుగుణాఢ్యు ♦ పెద్దతండ్రి
సంస్కృతాంధ్రకవిత్వ ♦ చతురకోవిదుఁడు కో
దండరామాఖ్యుఁ డే ♦ ధన్యు తండ్రి
విమలసచ్చారిత్ర ♦ విఖ్యాతయగు శేష
మాంబాఖ్యతరుణి యే ♦ యనఘు తల్లి

తే. గీ. విమల కౌండిన్యవంశమే ♦ వినుతచరితు
నన్వయంబౌచు నలరారు ♦ నవనిమీఁద
నట్టి విబుధజనవిధేయుఁ ♦ డమలయశుఁడు
నయవిహీనుండు వేంకటరత్న ♦ నాముఁ డబల.

నటి—ఓహో! ఇతఁడా! సరిసరి. ఈనూతనకవి యొనర్చిన నాటకంబుచేతనా! మనమీసభ్యుల రంజింపఁజేయుట. అందులో నాటకరచన కతని కిదియే ప్రథమముగాబోలు.

సూత్రి—ఓసి! వెఱ్ఱిదానా! నీకాసంశయ మవసరము లేదు. ఏమన ప్రాజ్ఞులగు సభికులు కథాప్రాశస్త్యమునే జూతురుగాని కవిత్వ

మాధురిమను గణింపరు. అదియునుగాక కవిగూడ వారి కీవిధంబున విన్నవింపఁగోరినాఁడు— ఓ విబుధాగ్రేసరులారా !

చ॥ పరమకృపాళుఁడై పరగు ♦ పాలకుఁ డీశ్వరుఁ డిచ్చినట్టి భా
సురమగు బుద్ధిసంపదల ♦ సొంపెగదా కవనంబు గాన సా
దరమతిఁ దప్పులన్ విడిచి ♦ యెద్దయు నొప్పులె జూడఁగోరెదన్
మురువుగఁ దేనెలాని వెసఁ ♦ బూవులవీడెడి తేంట్లకై వడిన్.

నటి—సరే ! అట్లయిన నాలస్యమెందులకు వలయుపాత్రలను సిద్ధపఱుపవలయును గదా !

సూత్ర—అవును. పోదము పద. (ఇద్దరు నిష్క్రమింతురు.)

( ఇది ప్రస్తావన. )



శ్రీ

శ్రీకాళహస్తీశ్వరసహాయం

శ్రీఆంజనేయస్వామినేనమః

# మారుతి విజయము.

## ప్రథమాంకము.

### రంగము—రావణుని కొలువుకూటము.

రావణుని ప్రవేశము.

రావ—ఆహా! ఏమిది! అబ్బా! రాముబాణంబు లెంతచురుకైనవి.

మ॥ అకటా! మర్మములెల్లఁ గాలదొడఁగెన్ హా! రాముబాణాగ్నిచే
వికలంబయ్యె మనంబు దప్పివడమెన్ ♦ బీరమ్ము వమ్మయ్యెఁగా
ర్ముకఖడ్గాది సమస్తసాధనచయం ♦ బుల్ వోయె నేఁడాజిలో
సకలంబిట్టులు వ్యర్థమయ్యె నరిచే ♦ శౌర్యంబు లింకేటికిన్.

మున్నింద్రాగ్నియమ నైఋతి వరుణవాయు కుబేరేశానులతోడఁ బోరితిని; గాని యీచురుకుదనంబును; నీలాఘువలక్ష్యశుద్ధులను, వారి యెడఁగాన. నేటిసంగరంబున యూపాక్షు, విరూపాక్షు, శుపార్శ్వాలాదిగాఁగల కుమారవర్గంబును, వృశ్చికరోమ, సర్పరోములు మొదలుగాఁగల దండనాథులును మడసిరి. మూలబలంబంతయు నిర్మూలంబయ్యె. అది యేమిమాయయోకాని

ఉ. ఆలమునందు నేనెచట ♦ నారసి చూచితిఁగాని రాముఁడా
భీలశరాళిఁ జిమ్ముచతి ♦ భీకరుఁడై కనవచ్చుదానవుల్
కాలునిరీతి పీనిఁగని ♦ కాల్కొలఁదిన్ బరువెత్తుచుందురా
కాలుఁడుగూడ పీనిగతి ♦ క్రౌర్యముజూపఁడు ప్రాణికోటిపై.

అప్పుడుకాదిప్పుడో! యేవస్తువుఁ గనుగొన్నను, నేనెవ్వ జూచినను, నెవరిని బరికించినను, నాకు రామమయమై కాన్పించు. అష్టదిక్పాలయుతుండయిన యమరేశ్వరునిచే సహిత మూడిగ మొనరించుకొన్న నేనిప్పుడొక మానవాధముచే నోటమినొందుటజూడ నాలోనాకే సిగ్గగుచున్నది. (ఆలోచించి) పోనీ! మతిపోయిన నాపిచ్చిజడదారుల మాటచొప్పున మావిభీషణుడన్నట్లీతఁడా శ్రీహరియౌ యేమి? అయిననేమి? మావిభీషణుండన్నట్లు సీతనొసంగి యాతనిశరణు వేఁడమనియా (క్రోధాట్టహాసముతో) ఆఁ! ఏమీ! దిగ్విజయంబొనరించి సకల లోకంబులఁ గెలిచి సకల దేవతలచే నూడిగంబొనరించుకొను నేను! మదీయ భుజాకండూతివాయఁ గైలాసంబెత్తి బంతిమాడ్కి నాడి శంకరునిచే మెప్పొందిననేను! ఒక్కమానవాధముని శరణంబు వేఁడుదునే? వేఁడక చేయునదియేమి? రాముచెదిర్చి సంగరంబొనర్చ (పెదవి విఱచి) అక్కో! అదియునుగాదు! పోనీ! యెవ్వరినైన సాయము గోరెదనన్న అయ్యో! కుమారా! నీవు డిన నాకీకష్టము లేకపోవునుగదా! తండ్రీ! నాకంటెముందు నిన్నే యుద్ధమునకుఁ బంపి చంపుకొంటినే! (లక్ష్మణునుద్దేశించి) ఓరీ! లక్ష్మణహతకా!

మ॥ అనిలోనన్ బలుమారు నాసుతునిచే ♦ నాత్మీయులున్ నీవు నీ
యనుజుండున్ మునునాగయు యుద్ధమున ద్రై ♦ స్వాంబంధఁ గాలేదనీ
మనమందయ్యది విస్మృతిన్ బొందెనే? ♦ మానంబుతోనంతునా
తనయున్ జంపితివేమి పౌరుషమదే ♦ ధర్మంబురా? దుర్మతీ!

కానిమ్ము నీవుమాత్రము జీవింతువా? నేఁడు సంగరంబున మదీయశక్తి ప్రహారంబుచే నీవు మొదటఁ బ్రేతలోకంబుగాంచఁ బట్టితివనియే తలంచితిని. కాని సారథుడింతదనుకఁ జెప్పినదానినిబట్టి చూడఁగ నింకను బ్రాణంబులున్నవనియుఁ బ్రతికించుటకు కాకోతిసంజీవిఁ దేఁబోయెననియుఁ దెలిసినది. ఆఁ! కోఁతియన్న జ్ఞప్తికివచ్చినది. వాడొకఁడు కోతి! యైరావతవిజయచిహ్నాంకితంబై సురాసురులకున్

బెట్టకనలవిగాక శ్రీహరివక్షఃస్థలంబునఁ గౌస్తుభంబువలె మదీయ వక్షోభూషణంబగు నైరావతదంతశకలం బొక్కపిడికిటిపోటున కూడి పడునట్లొనర్చె. ఇది యిట్లుండ నొంటిమై సంజీవిఁదేఁబోయెనఁట. దీనికి విఘ్నంబొనఁగూడిన బాగుండును. సూర్యోదయం బైన లక్ష్మణుండు జీవింపఁడు. లక్ష్మణుండు సచ్చినరాముండును గడతేరు. (ఆలోచించి) కాలనేమిఁ బంపితిగదా! వాఁడుకడుమాయావి! తండ్రికన్న ఘనుఁడు ఇదిగాక యయ్యౌషధగిరి చుట్టును పదునాలుగు కోట్లగంధర్వులు కాఁపుండిరఁట. ఇది యిట్లుండ స్థూలజంఘాది రాక్షసులఁదోడిచ్చి మనమాల్యవంతుని బంపితినిగదా! అతండనన్యసామాన్య విక్రముఁడు. తొల్లి విష్ణునితోఁబోరి యాతనిపోటును సహితము లెక్కసేయని బాహుబలుఁడు. మొదటఁ గాలనేమిమాయావాగురఁ జిక్కవెడలుటయే దుస్తరము. ఒకవేళ నయ్యదినిర్గమించినను గంధర్వులచేఁ జావుసక్కము. అదియుఁగడచిన మాల్యవంతునిచేఁ జచ్చుట ధ్రువము. దైవకృపచే నీనిసన్నిటిని గడచినను గొంతకాలహరణము గాకమానదు గదా! అంతలోఁ బ్రొద్దుపొడిచిన మదీప్సితంబె నెరవేరు. [పరిక్రమించి] ఇఁకఁ బ్రొద్దెక్కునట్లుగా నున్నట్లు కాన్పింపదు. అల్లదే!

మ॥ సకలామ్నాయ రహస్యవేది ♦ సురదుర్వ్యాధ్యక్రియాదక్షుఁడున్
ప్రకటాలోకన జాయమాన కరుణా ♦ ప్రస్ఫీత దైత్యాన్వయుం
డకలంకాత్ముఁడల్లదే! పొడమెఁ బూ ♦ ర్వాశాస్థలిన్ భార్గవుం
డిఁకపై నాయునుఁబద్భవంబుఁ గనునా ♦ యిష్టార్థ మీడేరఁగన్.

ఇంకఁ గొంచెముసేపులో భాస్కరోదయంబును లక్ష్మణాస్తమయంబును గాఁగలదు. (ఆలోచించి) కాలనేమి వెంటఁ బంపబడిన సారణుఁడింతదనుక రాలేదేమి చెపుమా? అచ్చటి వృత్తాంతమేమైనదో?

భటుఁడు—(ప్రవేశించి) దేవా! జయము! జయము! సారణుఁడు వాకిట తమదర్శనమునకై వేచియున్నాఁడు.

నన్ను నిర్దేశించె. నేనును నాతనిఁగొనిపోయి నాకొలను జూపితి. ఆవానరుండును నీమోసంబెరుఁగక నిశ్చింతతో నాకొలనిలో దిగె.

రావ—బళే! (కాలనేమినుద్దేశించి) నీవు నీతండ్రికంటె మాయలయందేఁడాకులెక్కువచదివితివిరా! పిమ్మట

సార—స్వామీ! యాతఁడట్లా కొలనిలోనికి దిగునంత నా గ్రాహం బాతని బట్టిమింగె.

రావ—(సంతోషముతో) స్వామిభక్తియన్న నిట్లుండవలె. కాలనేమి యెక్కడ! వానికి నాయర్ధరాజ్యం బిచ్చెద వాని నాయెదుటకుఁ గొనిరమ్ము.

సార—దేవరసాంగముగా జిత్తగింపవేఁడెద.

రావ—చిత్తగించుటకేమున్నది. హనుమంతుని రాకకై వేఁచి యతఁడెంతకును రాసందున విసిగి లక్ష్మణునిపై నాసపీడి రాముండును ననుజు ననుసరించెననియా? సరే! యిఁక జెప్పనవసరము లేదు! ఓరీ! ఎవఁడురా! అక్కడ.

భటు—(ప్రవేశించి) దేవా! ఏమిసెలవు!

రావ—నీవిని మావిద్యుజ్జిహ్వునికడకుఁ గొంపోయి తగు బహుమానము సేయుటకు మాయాజ్ఞయైనదని చెప్పుము. సారణా! నేటితో నావైర మంతరించినట్టే! పొమ్ము.

సార—దేవా! అట్లు జరుగలేదు. చిన్న అవటకవధరింప వేఁడెద.

రావ—(తెల్లఁబోయి) ఏమీ! అట్లు జరుగలేదా! మరెట్లు జరిగినది? చెప్పు చెప్పు.

సార—అట్లా నక్రమంబుచే మ్రింగుబడి యాతండొక్కపెట్టునఁ దన శరీరంబు పెంచిన, నాగ్రాహంబునకూపిరి వెడలక యుదరంబుపగిలి

రావ—గిరినే పెల్లగించి తెచ్చెనా? ఔరా! వానిసాహసము. తరువాత

సార—అట్లువచ్చు నా వానరవీరునిఁ గనుఁగొని మనవారు వానిఁ బోనీయక చుట్టుముట్టి పరశు, పట్టిస, భిండివాలా ద్యనేకాయుధమ్ము లొక్కుమ్మడిఁ బరపి వేఁడి నూపుటయు నావీరుండు నేయివోసిన మంటయగ్నియుంబోలె మండిపడుచు విజృంభించి యొక్కకేల నప్పర్వతంబుఁ బదిలపఱచి వాలంబుఁ జాఁచి యొక్కొక్కపరి పదులకొలఁది రాక్షసవీరుల నావాలంబునఁ జుట్టి సంద్రంబునఁ బడవైచుచుఁ గొందఱ నఖంబులఁ జీరియు గొందఱ ముష్టిఘాతంబుల నొంచియు, గొందఱ పాదంబులఁ జదిపియుఁ మన సేననేలకుఁ గూలఁ జేయుటనుజూచి సహింపక మాల్యవంతుండు సింహనాదంబుఁ జేసి ధనువు సజ్యంబుఁ గావించుకొని యావానరునిమీఁద శరవర్షంబు గురిపింప నాతండది లెక్కసేయక వాలంబుచే నాతని విల్లువిఱిచి తలదన్నిన నారాక్షసవీరుండు మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి రోషతామ్రాక్షుండై సవ్యాపసవ్యహస్తంబుల శక్తిశూలంబులఁ బూనివైవ నాతండా రెండింటినిఁ గూడ విఱువ మాల్యవంతుండు నాకపోత్తముని వక్షస్థలంబున కచ్చెలువహించుచు, గాంకటాక్షులఖంబగు కరవాలంబుచే నా కపివరుని వక్షంబు నడువ నదియు వజ్రకర్కశంబగు నాతని యురంబు తాఁకి తునకలై నేలఁబడియెను. అంతనా హనుమంతుండు కోపోద్రిక్తుండై తనవాలంబా మాల్యవంతుని కంఠంబు నకుఁజుట్టి గిరగిరఁద్రిప్పి సంద్రంబునఁ బడవైచె. అట్లు త్రేవఁబడి కొంతవడి నిశ్చేష్టితుండై పడియుండి తెలిసి రసాతలంబునకుఁ జనియె. హతశేషులగు రక్కసులును నాతనినే యనుసరించిరి. అంత నా హనుమంతుఁ డడ్డులేక పర్వతంబుఁ గొంచుఁ జనియె.

రావ—(విచారముతో) సరియె! ఇంతకును నావ ప్రాతికూల్యంబునకు నయినది లేదు. లేకున్న జగదేకవీరులగు నింతమంది రాక్షస

వీరుల నొక్క వానరుండెట్లు సమయింపనోపు. ఇఁకనీ వరుగుము.

సార—చిత్తము (అని నిష్క్రమించును.)

రావ—ఆహా! గంధర్వ సిద్ధ సాధ్య విద్యాధరాద్యఖిల సుపర్వుల మున్నొక్కడొక్కడె పెక్కు చిక్కులఁ బెట్టి యలయించిన రాక్షసవీరు లిందరిట్లొక్కనిచే ద్రుంగుటజూడ నాకుఁగడు 'నాశ్చర్యంబై చూపట్టెడిని. నేను మున్నాయజునిచే వరంబులుఁ గొనునప్పుడు దానవభోజన భాజనంబులే కదాయను నిర్లక్ష్యముచే నరవానరులచేఁ జావకుండునట్లు వరంబులు గోరనైతి. దాని నూహించియే దేవతలీ నరవానరరూపంబుల నన్ను సాధింపగడఁగిరని తలంచెద. కానిమ్ము భవితవ్య మెట్లున్నదో యట్లుకాక మానదు. (యోజించి) మాల్యవదాదులచే హనుమ తుండు మడియును, దాన నాయభీష్టంబు నెరవేరునను నాశతోనుండ నదియు వమ్మయ్యె. అల్లదె! తెల్లవాఱుచున్నది. ఈయుడియాసలంబడి చింతించుచు నీరేయియంతయు నొక్క త్రుటిగా వెళ్ళఁబుచ్చి నానిశాచరత్వమును సార్థకపఱచుకొంటిని. (ఆలోచన మభినయించి) బలే మంచియోజన పొడకట్టినది. ప్రస్తుతమందాతఁడే నాపగ నీఁగఁగలవాఁడు.

మ. వరదివ్యాస్త్రవిశారదుండు పటుదో ♦ స్స్ఫారప్రమత్తారివి
స్ఫురగర్వాపనయు ప్రవీణుఁ డసుర ♦ స్తుత్యప్రభావోదయుం
డురుమాయావిధ భాసురుండు నిరపా ♦ యుండైన మైరావణుం
డరయన్ నాదగు సూడుఁదీర్పఁగల ధ ♦ న్యాత్ముండు ధాత్రీస్థలిన్.

అదియునుగాక మున్నొకప్పుడు నీకుఁ దీర్పరాని యిక్కట్టు సంభవించినప్పుడు నన్ను దలంచునది, తత్క్షణంబ సన్నిహితుండనై దానిం దీర్చెదనని వాక్రుచ్చెఁగాన నాతనిన్ దలంచెద. (ధ్యానము నటించును.)

మైరా—(ప్రవేశించి తనలో) ఏమిది! నా ప్రియమిత్రుండగు రావణుండీ యసమయంబున నన్నుఁ దలంచుటకుఁ గతంబేమి చెపుమా? ఈతనికేదైన ముప్పు వాటిల్లెనుగద? (పరిక్రమించి) ఇదిగో! ఇచ్చట యొంటిమై యాలోచనాగ్నమనస్కుఁడై చూపట్టెడిని (ప్రకాశముగా) మిత్రమా!

రావ—(ఎదురుగా వచ్చి కౌఁగలించుకొని) మిత్రమా! కుశలమా?

మైరా—ఆఁ! కుశలమే. ఇట్టి యసమయంబున నొంటరిగా నిచ్చట గూరుచుంటివేల? నన్నుఁ దలఁచిన కార్యమేమి? వేగంబ చెప్పుము.

రావ—మిత్రమా! నా స్థితి సేమముగ చెప్పెదను.

చం. అనయము దానిఁ జేసి స్మృతి కాత్మను గుంది కృశించుచుండునా
యనుజను నూరడించుటకు ♦ నై ఖరదూషణ ముఖ్య దైత్యులన్
వానికిఁ గోడెగా నిడి ♦ ఁ బంపితినుండఁగ దండకాటవిన్
వనమునఁ గ్రీడసల్పుచును ♦ వారని దుంపముచేసి నంపెనన్.

మైరా—సరే! అల్లనాఁ నిచ్చట సహజమే తరువాత.

రావ—అట్లు వారలా దండకాటవియందలి జనస్థానంబు నివాసముగా జేసికొని వసింపుచుండ.

సీ. దశరథుండనువాని ♦ ధరణీశచంద్రుని
పుత్రుండు రాముఁ ♦ డనుజుఁడెల్ల
వెడలంగఁద్రోసిన నడవులయందున
ననుజుఁడు సతియుఁ ద ♦ న్ననుసరింప
సంచరించుచు జన ♦ స్థానంబునందున
వాసంబుఁగైకొని ♦ వఱలుచుండ
మన శూర్పణఖ వారిఁ ♦ గనుఁగొంచు దరిఁజేరి
క్రొత్తవారలటంచుఁ ♦ జిత్తమందు

రావ—పిమ్మట.

సీ. భార్యా వియోగంబు ♦ భరియింపఁజాలక
తమ్మునిఁ దోడ్కొని ♦ దండకవని
నెల్లెడఁ జరియించి ♦ యినసూనుఁడున్నట్టి
ఘనఋశ్యమూకాద్రి ♦ కడకుఁ జేరి
సుగ్రీవుతో మైత్రి ♦ సొరిదిఁ గావించి
దొంగపోటున వాలిఁ ♦ గ్రుంగఁ జేసి
కపిసేన సమకూర్చి ♦ కడలికి సేతువు
నిర్మించి మనలంక ♦ నెలవుఁ జేసి
తే. గీ. సుతుల హితులను మఱి బంధు ♦ తతుల నెల్ల
సవనిఁ గూల్చిరి నన్నుఁ దక్క ♦ నక్కజముగఁ
గడకుఁ బలితోఁ దనఁగని గోత్ర ♦ కళిచెసన్న
చాదమయ్యెను నాగతి ♦ సఖుఁడ నేఁడు!

ఇంతకును మన విభీషణుఁడు పగవారిని జేరబట్టియే నాకీగతి వచ్చినది. ఇచటి మర్మంబులెల్లఁ బూసగ్రుచ్చినట్లక్కడి వారికిఁ జెప్పనుండఁబట్టియే వారికి విజయమింత సులభ సాధ్యమైనది.

మైరా—ఏమీ! మన విభీషణుఁడు పగవారిఁ జేరెనా? అతఁడట్లులేల చేయవలసివచ్చెను?

రావ—ఎందులకా!

చం. చెలిమిలి చేటునై సదన ♦ చిత్తమునన్ దలపోయకుండ న
న్నాలఁ బగవానిచేఁతలనె ♦ పల్కెను ధర్మనిభంగిఁ జెప్పచున్
వలదికనైన పాదములఁ ♦ బట్టుము చాపఁడటంచుఁ బల్కి న
ప్పలుకుల కాగ్రహించి పద ♦ వారకతన్నిన నేగె రోషియై.

ఇట్టి విపత్తెయంపనుడఁబట్టియే నిన్నుఁ దలంచితిని. "శ్లో॥ కేనా ప్యుత్తమయం సృష్టమ్ మిత్రమిత్యక్షరద్వయమ్। ఆపదంచ పరి

శరధిన్ జేరెడి త్రోవ వెంబడిఁ జనన్ • సత్యంబుగా నేఁడు దా
శరథిన్ దమ్మునితోడఁ గూల్తు నిఁక నే • సంగ్రామరంగంబునన్
ఇఁక నాకు సెలవొసంగుము. నేఁబోయెద. (పోఁబోవును.)

రావ—(చెయ్యిఁబట్టియాపి) మిత్రమా! కొంచెమాగుము. ఎదిరినిఁ దన్నెఱుంగక ముందు సాహసింపఁ జనదు. రాముఁడన, సామాన్యుఁడనకొంటివా యేమి? అతని పరాక్రమం బించుక తెల్పెదవినుము.

మ. అనుమానంబునువీడి తాటకను ఘో • రాజిన్ జెనకన్ ద్రుంచెఁ, ద
త్తనయుల్ గూల్చె, సుబాహు పిమ్మట • జనస్థానంబునన్ దైత్యులన్
ఘనదుర్వార పరాక్రమాఢ్యులను • ఖండించె, నిర్భీతిన
య్యనవంశోత్తము బాహుదర్పపటిమం • బెన్నంగ సామాన్యమే?

మఱియు

సీ॥ చిగురుఁ బ్రాయమునందె • శితికంఠు విల్లును
వెఱకుగ్గ్రియవఁ దె • విఱిచివైచె
రాజకులైక వి • రాముఁడై రాజిల్లు
భార్గవరాముని • భంగపఱిచెఁ
బ్రతివీరుఁ డగు • ఖరవిరాధ విలసిల్లు
వాలిని నొక్కకోలఁ • గూలవైచెఁ
దులలేని బలశక్తిఁ • జెలఁగుచుఁ బొగడొందు
ఘన కుంభకర్ణుని • మడియఁ జేసెఁ

తే॥ గీ॥ సరియగు రాముని సాటివా • రెవరులుకారు
బాహువిక్రమ గాంభీర్య • బలములందుఁ
గాన చెదిరించి పోర గాఁ • గాదుసుమ్ము
మాయఁ గైకొని పోరుటే • మనకు లెస్స!

కావున దనుజుల కవశ్యాచరణీయంబగు మాయాయుద్ధంబుననే వారిఁ జయింపవలయు.

మైరా—(ఆలోచించి) అవును. నిజమే. నీవుచెప్పినదికూడ బాగుగనే యున్నది. ఎదిరించి పోరిన జయమంత సులభసాధ్యము కాదు. కావున మాయచే నెట్టులైన నారామలక్ష్మణుల నిద్దఱ నేటిరేయిఁ గొనిపోయి నాలంకయందలి కాళికకుఁ బలినొసంగెద. నీవు నిశ్చింత నుండుము. ఇదే పోయెద.

రావ—మంచిది. కార్యమునం దప్రమత్తుఁడవై జరియింపుము. కార్య సాఫల్యంబైన వెనుక నొక్కమారు పునర్దర్శన మీయవేఁడెద.

మైరా—నేనొనరించు గార్యంబుల కెన్నఁడైన విఘ్నంబు లొదవునా! నీవు కోరినరీతిని కార్యము సఫలంబైన పిమ్మట నిన్నుఁ గలిసి కొనెద. (నిష్క్రమించును.)

రావ—(తనలో) ఈతం డెట్టులైనను దన పట్టినపట్టు విడుచువాఁడు కాఁడు. కార్యం బెట్టిదైనను దుదవరకుఁ జూచితీరును. వీనిచే నావైర మంతరించుననిలోఁచుచున్నది. (ఆలోచించి) ఆహా! అంతటి యదృష్టమా? కాని! దీనినిగూడఁ జూచెదఁగాక.

(నిష్క్రమించును.)

ప్రథమాంకము సంపూర్ణము.

శ్రీ ఆంజనేయార్పణమస్తు.





శ్రీ

శ్రీకాకుళరమణసహాయం.

శ్రీ ఆంజనేయస్వామినేనమః.

# మారుతి విజయము.

## ద్వితీయాంకము.

### రంగము—సువేలాచలపర్వతము.

[రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు ప్రవేశింతురు.]

రాము—సుగ్రీవా! రాత్రి మనయాంజనేయుఁ డొనర్చిన సాహస మత్యంత స్మరణీయము సుమా!

మ॥ దనుజాస్త్రక్షత రక్తసిక్తతనుఁడై ♦ ధాత్రీస్థలిన్ గూలు ల
క్ష్మణునిన్ గాంచి యమోఘవేగమడరన్ ♦ సంద్రంబులన్ దాటి యా
యినుఁడే తేరక మున్నె ద్రోణగిరినే ♦ హేలాగతిన్ దెచ్చినా
యనుజున్ జీవితుఁ గాఁగఁ జేసెఁ గరుణా ♦ స్వాంతుండితం డల్పుఁడే?

మఱియు

శా॥ ఘోరాకారములొప్ప దైత్యులుమహి ♦ ఘోద్యోగసంరంభులై
దారిన్ సైరతినడ్డమై పెనఁగ దో ♦ ర్దర్పంబునన్ గొంగి గం
భీరాకారముఁ దాల్చి రక్కసుల ప్రా ♦ ణవ్రాతంబు మాయించెనా
వీరోత్తంసుని బాహువిక్రమ బలో ♦ ద్వేలంబు సామాన్యమే?

ఇదికాశప్పర్వతంబుఁ గొనివచ్చునప్పు డాతనిమూర్తి యత్యంత దర్శనీయమై చూపట్టెడిని

మ॥ అరుణాంశూజ్జ్వల బింబదీప్తిసమమై ♦ యాస్యంబు సొంపార గ
త్యురువజ్రోపల కర్కశంబులగు బా ♦ హుద్వంద్వమే పార వి

స్ఫురదుగ్రాశనితుల్యవాలమమరన్ ♦ జోద్యంబుగా వచ్చునా
పరవీరోత్తముభవ్యమూర్తిఁగన నా ♦ స్వాంతంబు శోభిల్లెడిన్.

ఈపరోపకార పారీణుఁడు మమ్ముద్ధరించుట కిదియే ప్రథమంబు గాదు.

సీ॥ అతివను గోల్పోయి ♦ యడవులఁదిరుగాడు
నాకుసీతను మైత్రి ♦ సలుపఁజేసెఁ
గపిసేన సముకూర్పఁ ♦ గాలంబు వృథసయు
నిన్న నూలకొల్పఁజేసె ♦ నేర్పుమీఱ
దగుణిప్రాణముఁగోయఁ ♦ దలపోయు నాదుసే
మముఁజెప్పి నాతిప్రా ♦ ణమునునిలిపె
నింద్రజిద్బాణాగ్ని ♦ నిలఁగూలు కపిసేన
జీవింపఁజేసె సం ♦ జీవిఁదెచ్చి
తే. గీ. ఆలమున నేఁడు లక్ష్మణుం ♦ డవనిఁగూల
వాని బ్రతుకింగఁజేసెన ♦ వార్యశక్తి
మొదటినుండియు నాపుణ్య ♦ మూర్తి కరుణ
మాకుఁజేసిన లగ్గుల ♦ మఱువఁదరమె!

సుగ్రీ—దేవా! భృత్యుఁడింత ప్రొగడ్తకుఁ దగఁడు. దేవరయెడ దన విధ్యుక్తమును నెఱవేర్చుకొనెను. దానికింత ప్రొగడ్తయేల!

రాము—కపిరాజా! మాకింత మహోపకారము నర్చిన మారుతి మాకు భృత్యుండెట్లగు? నాకాతఁడు సోదరతుల్యుండు.

లక్ష్మ—భానుజా! నాకుఁ జాలకాలమునుండి యొక విషయంబుఁదెలిసికొనఁ గోరికగలదు. ఏమన ఇంతటి పరాక్రమోపేతుండగు సచివుండుండియు నీవు వాలినిఁ జయింపలేక పోవుటకు గతంబేమి?

సుగ్రీ—సుమిత్రాపుత్రా! దానికిఁదగు కారణంబులేక పోలేదు. ఆంజ

నేయుండు, నేనును వాలియుఁ గలసి యున్నప్పుడు మమ్ముల నిద్దర నొక్కరీతిగనే సేవించుచుండె. అది కతంబున నాతఁడు వాలితోఁ బోర నిచ్చగింపఁడయ్యె. వాలియు నీతఁడు నాయుద్ద యునికిఁ జేసియే నన్నుఁ జంపుట కంతగా సాహసింపఁడయ్యె. ఇదిగాక దీనికింకొక ప్రబల కారణంబుఁ గలదు.

ఉ. చిన్నతనంబునందితఁడు ♦ జెన్నగు నైజపు చాపలంబునన్
మిన్నక మౌనివర్యులను ♦ మేరఁదొలంగి గలంచుచుండ నా
పన్నతనొంది కోపమున ♦ వారలు శాపమొసంగిరయ్యెడన్
సన్నుతపాత్రమైన తన ♦ సత్త్వము దాని యెరుంగ కుండఁగన్.

దాన దన సత్త్వంబొరు లెరింగించినఁగాని తెలియనేరఁడు.

లక్ష్మ—అటులనా ?

రామ—సుగ్రీవా ! రావణుఁడిఁక నేమి చేయునని తలంచెదవు.

సుగ్రీ—దేవా ! లంకయందు సన్నాహంబున్నట్టు కాన్పింపదు. నిన్నటి పరాభవంబుతోనే యాతఁడు నిరుత్సాహుఁడైనట్టు తోఁచెడిని.

చం. తలముడివీడఁ బాదములు ♦ దద్దయుఁ దొట్రిలుచుండ వానరుల్
కిలకిలమంచు నవ్వుచును ♦ గేకిసలాడుచు వెన్కొనంగఁ దా
బలుమరు వెన్కఁజూచుచును ♦ బాఱెను దైత్యుఁడు లంకలోనికిన్
దలపడుటంచు నెంచెదను ♦ దానయి యుద్ధముసేయ నెప్పుడున్.

రాము—అట్లెన్నడును దలంపఁగూడదు. యుద్ధమందొకప్పు డపజయంబు కల్గినంత మాత్రమున శూరులు యుద్ధ విముఖులగుట కల్ల. రావణుఁడుగూడ శూరుఁడననొప్పు. అదియునుగాక పట్టినపట్టు విడుచువాఁడునుగాడు. ఇంకేదియో ప్రబలయత్న మొనరించుచుండెనని తోఁచెడిని.

లక్ష్మ—రావణుఁడుగూడ నొక శూరుఁడేనా! శూరుఁడగువాఁడు సంగరంబున వైరికి వెన్నిచ్చి చనునే? దొంగమాటునఁ బర

స్త్రీల దొంగిలించుటయందు మాత్రమీతఁడు కడుశూరుఁడనియే చెప్పవచ్చును.

రాము—అట్లనకుము. రావణుఁడు మున్నొనర్చిన శూరకృత్యము లనేకములుకలవు. శంకరునితోడ రజతాచలంబెత్తుటయున సామాన్యమా? త్రిజగంబులకుఁ బ్రభువైన దేవేంద్రునిచే సహితము మ్రొక్కించుకొనుటయున సామాన్యమా? సుగ్రీవా! నేడు వారలు తమంతట దాము మనపైకి యుద్ధమునకువచ్చునట్లు గాన్పింపదు. కావుననీవేగి మనసైన్యంబుల నెప్పటియట్ల లగ్గలుపట్టు నట్లొనర్పుమని మనవీరుల కాజ్ఞాపింపుము. పొమ్ము.

సుగ్రీ—చిత్తము. (అని నిష్క్రమించును.)

రాము—లక్ష్మణా! నేటిరీతిఁజూడ మనల జయింప రావణుండు మరల నేదియో గొప్పయత్నముఁ జేయుచుండినట్లు తోఁచుచున్నది. మనవిభీషణుఁ డుదయంబునుండియు నాకడకురాకతడసె. అతఁడు వచ్చినఁగాని యచ్చటివృత్తాంతంబు దెలియనేరదు.

లక్ష్మ—అన్నయ్యా! మీరెప్పుడిట్టి యూహలచే నూరకఁ బెదరుచుందురు. ఇంకను వాడొనర్చునదియేమి?

చ॥ అనుజుఁడు కుంభకర్ణుఁడును ♦ నాత్మజుఁ డాహరిజిత్తు మిత్రులుఁ
ఘనభుజులైన పుత్రులును ♦ గార్యవిచక్షణులైన మంత్రులుఁ
దనుజులనేకులీ కలన ♦ ధారుణిఁగూలిరి దానవుండిఁకన్
గనుఁగొనఁజేయఁగా గలుగు ♦ గార్యమదెయ్యది చూడభూవరా!

రాము—అట్లుతలంపఁ గూడదు. రావణుఁడుమాత్రముసామాన్యుఁడా? వాఁడు పట్టిపట్టినపట్టు తుదముట్టువఱకును మిన్నకుండువాడు కాఁడు. మనల జయింప నేదేని మాయోపాయము నెమకుచుండుననియే నాయభిప్రాయము. (చూచి) అల్లదే! మన

యాంజనేయుండేదియో గొణుగుకొనుచు నీదిక్కునకె వచ్చు
చున్నాఁడు.

లక్ష్మ—అతనికి గొణుగు కొనుటకేమున్నది? సంతతము మీనాపు
స్మరణమే గదా!

(ఆంజనేయుండు ప్రవేశించును.)

ఆంజ—ఆహా! రామభక్తికి మించినదింకొక టేదియును లేదుకదా?

సీ॥ పారంబులేని సంసార ♦ వార్ధినిదాట
రమ్యతరీయుక్తి ♦ రామభక్తి
కామాదిరోగ సం ♦ ఘాతభీతిని బాప
ప్రణుతభేషజశక్తి ♦ రామభక్తి
అజ్ఞాన తిమిరంబు ♦ హరియింప మహిమీఁద
రవిబింబ సమదీప్తి ♦ రామభక్తి
ప్రబలనారకకూప ♦ పాతభీతులకును
రవిజహస్త విముక్తి ♦ రామభక్తి

తే॥ గీ॥ గ్రసితపాతకంపునివృత్తి ♦ రామభక్తి
రహిని మోక్షజనానక్తి ♦ రామభక్తి
కామితజనసుఖప్రాప్తి ♦ రామభక్తి
శ్రీమదతిసంపదవ్యాప్తి ♦ రామభక్తి

మఱియు,

మ॥ సరసీజాసన శంకరాదిజగదీ ♦ శస్తోత్రపాత్రంబు, దు
ష్కరపాపాటవి దావకేలి, భవరో ♦ గవ్యాప్తికిన్ మందు, సు
స్థిర మోక్షప్రద, మార్తరక్షణమునై ♦ దీపించి లోకాళికి
ద్ధరరామాఖ్యతఁబొల్చు మంత్రమును నే ♦ ధ్యానింతు మోక్షార్థినై.

(రామునికై తిరిగి చేతుల జోడించి)

సీ॥ వనరుహానేత్రాయ ♦ ఘననీలగాత్రాయ
భర్గమిత్రాయ తు ♦ భ్యన్నమోస్తు !
తాటకదమనాయ ♦ హాటకచేలాయ
భానుతేజాయ తు ♦ భ్యన్నమోస్తు !
హరధనుర్భంగాయ ♦ కరుణాంతరంగాయ
భరతాగ్రజాయ తు ♦ భ్యన్నమోస్తు !
పావనాభిఖ్యాయ ♦ పరమాత్మరూపాయ
భక్తావనాయ తు ♦ భ్యన్నమోస్తు !
తే॥ గీ॥ వాలినిగ్రహణాయ తు ♦ భ్యనమోస్తు !
ఆశ్రితజనరక్షాయ తు ♦ భ్యనమోస్తు !
అఖిలవేదవేద్యాయ తు ♦ భ్యన్నమోస్తు !
భగవతేరామచంద్ర తు ♦ భ్యనమోస్తు !

(అని నమస్కరించును.)

రాము—(లేవఁదీసి కౌఁగిలించుకొని) దీర్ఘాయురస్తు! ఆంజనేయా ఇటు కూర్చుండుము. (అని తనప్రక్కను గూర్చుండుట సూచించును. ఆంజనేయుం డట్లు కూర్చుండక రాముని పా ముల సమీపమునఁ గూర్చుండును.)

రాము—పావనీ! నిన్ను నీవొనర్చిన మహోపకారమెన్నటికిని మఱు దగినదికాదు.

ఉ. తమ్ముని భంగపాటుగని ♦ తాలిమిఁ దూలఁగ, గోపమొంది మ
ర్మమ్ములు దూటువారఁగను ♦ రక్కసునేసితి నంతెకాని నా
తమ్ముని ప్రాణమీయఁగను ♦ దార్ఢ్యముకల్గెనె నాకుఁజూడనీ
విమ్మహిదాని నిచ్చితివి ♦ కేగతిఁ దీరెడి నీఋణంబహో!

ఆంజ—దేవాది దేవా! శ్రీరామచంద్రా! ఏల నీగతి నీపొగడ్తకుఁ గుతిఁజేసెదవు నీవు భూభారంబు హరియింప మాయామానుషరూపంబుఁ గైకొనిన యాదినారాయణుండవు. సమస్త స్థావర జంగమంబుల కాత్మవునీవ. ఇట్టి నీవు మమ్మల నిమిత్తమాత్రములుగా నొనర్చికొని సకల కార్యంబులు నడుపుచుందువు. ఇట్లు నీవేయొనర్చిన పనికి నన్నేల పొగడవలె?

రాము—ఆంజనేయా! నీభక్తికిఁ గడు సంతసించితిని.

లక్ష్మ—అదిగో! మనసుగ్రీవుఁడు విభీషణువెంటనిడుకొని వచ్చుచున్నాఁడు.

రాము—ఏదియేని విశేషముండితీరవలయును. లేనిచో మన విభీషణుఁడాలసింపఁడు.

(విభీషణ సుగ్రీవులు ప్రవేశింతురు)

ఇద్దరు—రామచంద్రా! జయము, జయము,

రాము—విభీషణా! నేఁడేల యింతయాలసించితివి. క్రొత్తలేమైన గలవా?

విభీ—నేడు దేవర సావధానముగ నవధరింపవలసిన విశేషమే కలదు.

రాము—ఏమీ! సావధానముగ నవధరింపవలసిన విశేషమేకలదా? లక్ష్మణా! నేనుజెప్పలేదా! వాఁడేదియో మనలను జయించుటకుఁ గొప్పయత్నముఁ జేయుచుండునని; విభీషణా చెప్పుచెప్పు.

విభీ—దేవా! అవధరింపుము. రావణునకుఁ బ్రియమిత్రుండును పాతాళలంకాధినాథుండును నగు మైరావణుండను దైత్యనాయకుం

డొకఁడుకలఁడు. వాఁడు కడుమాయావి. రావణునికంటె భుజ బలంబునం దధికుండు. రావణుండు కడచినరాత్రి నిన్న దేవరచే దనకుఁగల్గిన పరాజయంబునకు దుఃఖించి తన ముప్పుఁదీర్పఁగల తనవారందరు గతించినందున నీమైరావణునిఁదలఁచి యాతనికి వృత్తాంతంబు దెలిపి తనకుఁ దోడుఁగమ్మని ప్రార్థించెను. దాని కతఁడుసమ్మతించి నేటిరాత్రి రామలక్ష్మణులఁ గొనిపోయి నాలఁకయందలి కాళికకుఁ బలినొసంగెదనని ధైర్యంబుఁజెప్పి చనియెనఁట.

లక్ష్మ—ఏమిఁ! రాత్రివేళ చోరునిగతి మమ్ముఁ గొనిపోవునా? (మైరావణు నుద్దేశించి) ఓరోరి! నిశాటా!

శా॥ ఔరా! దానవ! కొవ్వియీగతిని గ్రూ ♦ రాత్ముండవై మమ్ములన్
ఘోరాజిన్ దలకింపఁజాలకిటు సం ♦ కోచంబు లేకుండనో
క్రూరా! రాతిరివేళ చోరుగతి వే ♦ గొంపోవ నూహించితే
రారా! చూచెద నీదు వేడబములన్ ♦ రాకుండెడేమోసుమీ!

రాము—లక్ష్మణా! శాంతింపుము. విభీషణా! నీకీసంగతేటులఁ దెలిసెను?

విభీ—నాతోఁగూడఁదమకు శరణాగతులైన నామంత్రులు నల్వురను మదాజ్ఞచే ననేకంబులగు మాయారూపంబుల లంకయందుఁ దిరుగుచు నచ్చటివృత్తాంతంబులఁ గొనితెచ్చి నాకెఱిఁగింపు చుందురు. కడచినరాత్రికూడ నామంత్రులలో వజ్రదంతుడను వాఁడీ యుదంతంబుఁ గని నాకెఱిఁగించె.

రాము—అట్లైన యన్నృతము కానేరదుగదా?

విభీ—స్వామీ! తమసేవకులలో నమ్మతగనివారుకూడఁ గలరా!

రాము—అట్లైన మనము జాగరూకులమై యుండవలదే! ఇదివరకొక [illegible]
రావణునిచేతనే పడలేకయుండ నీ మైరావణుఁడుగూడ [illegible]
రించెనే?

విభీ—దేవా!

తే॥ గీ॥ దశముఖునికంటె! నాతని ♦ తనయుకంటె!
మాయలందున నీతఁడ ♦ మేయుఁ డధిప!
సంగరంబున శస్త్రాస్త్ర ♦ సమితిచేత
మరణమొందఁడు పద్మజు ♦ వరమువలన.

రాము—అటులనా! అట్లైన మనము మిక్కిలి జాగరూకతతో నుండ
వలసినదే. సుగ్రీవా! నీవేమనెదవు?

సుగ్రీ—దేవా!

శా॥ ఏలా భీతిని బొందెదీవిటులనో ♦ యిక్ష్వాకువంశాగ్రణీ!
ప్రాలేయాచలసానుసన్నిభతనుల్ ♦ ప్రస్ఫార బాహాగ్రులు
ద్వేలాభీల పరాక్రమక్రమములు న ♦ వీరోత్తముల్ వానరుల్
లీలన్ గాలుని దూలవైచెదరు దో ♦ ర్వీర్యంబునన్ భూవరా!

మఱియు,

శా॥ వీరేలా? భువి నేను గల్గునెడలన్ ♦ క్షితిల్లఁగానేల నే
పోరాటంబునఁదన్ గడంగినయెడన్ ♦ బోరన్ గలం డెవ్వఁడా
మారద్వేషి గడంగినన్ గెడపెదన్ ♦ మైరావణుండేల నా
క్రూరాత్ముని దలఁపంగనేల మది సం ♦ కోచంబులన్ వీడుమా

మదీయ బాహుబల రక్షితులగు మిమ్ములఁ జేరఁజూడ నా
రావణునకేకాదప్పాలనేత్రునికైన శక్యంబే? కావున భయంబ
దక్కి సుఖంబుండుఁడు.

రాము—సుగ్రీవా! నీవంతటివాఁడవే యగుదువు కాని,

మ॥ ఎదురై పోరినఁగాదె శాత్రవుని నీ ♦ వేరీతిగానైన నా
పద నొందించెద వట్లుకాక మదమే ♦ పారంగ మాయావివై
కదనంబందునఁ గానరానియెడలం ♦ గారింపనెట్లౌను న
య్యదనన్ బ్రాణముఁ గోలుపోవుటయెగా ♦ కాత్మన్ విచారింపఁగన్.

ప్రత్యర్థి ప్రత్యక్షంబుగా నిల్చి యుద్ధంబొనర్చిన వాఁ డేలోకంబున డాఁగినను, నెవ్వరడ్డంబైనను, మద్బాణాగ్ని కాహుతి యొనర్చెద. అట్లుగాక నాఁడా రావణి యొనర్చినవిధంబున నిప్పుడీరావణుండు గూడ మాయాయుద్ధంబునకున్ గడంగిన నేమి చేయనగునాయని యోజించుచుంటిని.

విభీ—స్వామీ! వాఁడు తప్పక మాయాయుద్ధంబుకే కడంగును.

లక్ష్మ—అన్నయ్యా! ఎందుల కీవిచారము. ఇంచుక తమ రాజ్ఞ యొసంగినచో

శా. ఖద్యోతంబులభంగి రాత్రిచరు లా ♦ కంపించుచున్ గాలఁగా
సద్యోజాతశరాగ్నిభీమశిఖలన్ ♦ సౌధంబులున్ గూలఁగా
విద్యోతంబగు బ్రహ్మబాణమున నే ♦ వేల్చింతు లంకాపురిన్
బ్రద్యోతప్రభఁగప్పు ధూమశిఖలన్ ♦ భస్మావశేషంబుగాన్.

శత్రువిధ్వంసనంబును, ప్రళయకాలానలాభీల జాజ్వల్యమానంబును, గాధేయప్రసాదలబ్ధంబును నగు బ్రహ్మాస్త్రంబీలంకపైఁ బ్రయోగించి యాబాలవృద్ధంబుగా నీలంక భస్మావశేషంబుఁ గావించి వార్ధిన్ గలిపెద. దాన మనవైర మంతయొందు.

రాము—తమ్ముఁడా! ఒక్కనికై పెక్కుమంది నిరపరాధుల వధించు టెట్టిధర్మము. రావణుఁడొక్కఁడేగదా! మనకపకారమొనర్చినది. అట్టియెడ నాబాలవృద్ధంబుగా లంకనుగాల్చుటెట్టిధర్మము. అదియునుగాక రావణుఁడుమాత్రమీ యస్త్రవిధానమెఱుఁగఁ డందునా? అతఁడుగూడ నీయస్త్రముచే ప్రయోగించిన తొఁ

స్త్రంబులును బోరి తుదకు లోకంబులు భస్మంబులుగానొనర్చు. దాన మనము లోకోపకార మొనర్చుటకు బదులు లోకాపకార మొనర్చినవారమగుదుము. కాన నది సరియైనపనిగాదు. ఆంజనేయా! నీయభిప్రాయ మేమి?

ఆంజ—స్వామీ! విన్నవించెద.

చ॥ అరి యెదుర్గైనవాని నెటు ♦ లైనను గూల్పఁగవచ్చుఁగాక శాం
బరి మెరయంగఁ బోరుగతి ♦ పచ్చెను వాని వధింపనెట్టు? లీ
తరుణమునందు దానవుఁడు ♦ దానటువచ్చెడి చొప్పుఁ దోఁచు ని
ప్పురుసున గట్టి రక్షణము ♦ బాయక చేయుట మేలు భూవరా!.

కావున మనవిభీషణుఁడు చెప్పెడి మాటలనుబట్టిచూడ వాఁడు మనల నెదిరించి పోరినఁ దానును వెనుకటివారినే యనుసరింప వలసివచ్చునను భీతిచే నేదైనఁ గపటోపాయంబున మమ్ముఁ గికురించి మిమ్ములఁ గొనిపోవ నూహించినట్లు కాన్పించెడిని. లేకయున్న మిమ్మెదిరించిపోర వానివశమా? కాన మనము జాగరూకులమై యుండుట యుత్తమము. దీనికి నాకొకయోజన పొడకట్టుచున్నది.

శా॥ భూతవ్రాతము జోద్యమొందఁ గనఁగాఁ ♦ బొల్పారు వాలంబునన్
జాతుర్యంబొదవంగఁ గోటనొకటిన్ ♦ సంధించియామీఁద ని
ర్భీతిన్ మిమ్ములనుంచి వాకిటను దో ♦ ర్వీర్యంబుతోనుండ నే
రీతిన్ శత్రుఁడు మిమ్ముఁ జేరఁగలఁడీ ♦ రే యిఁక విచారింపఁగన్.

ఇట్లు సురక్షితులరగు మిమ్ములఁ దేటి టకునై వైరి సమర్థుండుకాఁడు. ఇట్లీరాత్రిఁ గడిపిన రేపు నీయం బాలోచించుకొనవచ్చును.

రాము—ఆంజనేయా! నీవు చెప్పునది మిక్కిలి యుక్తియుక్తముగ నున్నది. అట్లెయొనర్తుము. అల్లదే! చండకిరణుండు చరమాద్రిఁ బ్రాపించుచుండె.

రాము—సుగ్రీవా! నీవంతటివాఁడవే యగుదువు కాని,

మ॥ ఎదురై పోరినఁగాదె శాత్రవుని నీ ♦ వేరీతిగానైన నా
పద నొందించెద వట్లుకాక మదమే ♦ పారంగ మాయావియై
కదనంబందునఁ గానరానియెడలం ♦ గారింపనెట్లౌను న
య్యదనన్ బాణముఁ గోలుపోవుటయెగా♦కాత్మన్ విచారింపఁగన్.

ప్రత్యర్థి ప్రత్యక్షంబుగా నిల్చి యుద్ధంబొనర్చిన వాఁ డేలోకంబున డాఁగినను, నెవ్వరడ్డంబైనను, మద్బాణాగ్ని కాహుతి యొనర్చెద. అట్లుగాక నాఁడా రావణి యొనర్చినవిధంబున నీమైరావణుండు గూడ మాయాయుద్ధంబునకుఁ గడంగిన నేమి చేయనగునాయని యోజించుచుంటిని.

విభీ—స్వామీ! వాఁడు తప్పక మాయాయుద్ధంబుకే కడంగును.

లక్ష్మ—అన్నయ్యా! ఎందుల కీవిచారము. ఇంచుక తమ రాజ్ఞ యొసంగినచో

శా. ఖద్యోతంబులభంగి రాత్రిచరు లా ♦ కంపించుచుం గాలఁగా
సద్యోజాతశరాగ్నిభీమశిఖలన్ ♦ సౌధంబులున్ గూలఁగా
విద్యోతంబగు బ్రహ్మబాణమున నే ♦ వేల్పింతు లంకాపురిన్
బ్రద్యోతప్రభఁ గప్పు ధూమశిఖలన్ ♦ భస్మావశేషంబుగాన్.

శత్రువిధ్వంసనంబును, ప్రళయకాలానలాభీల జాజ్వల్యమానంబును, గాధేయప్రసాదలబ్ధంబును నగు బ్రహ్మాస్త్రం బీలంకపైఁ బ్రయోగించి యాబాలవృద్ధంబుగా నీలంక భస్మావశేషంబుఁ గావించి వార్ధిన్ గలిపెద. దాన మనవైర మంతమొందు.

రాము—తమ్ముఁడా! ఒక్కనికై పెక్కుమంది నిరపరాధుల వధించు టేటిధర్మము. రావణుఁడొక్కఁడేగదా! మనకపకార మొనర్చినది. అట్టియెడ నాబాలవృద్ధంబుగా లంకనుగాల్చు టేటిధర్మము. అదియునుగాక రావణుఁడుమాత్రమీ యస్త్రవిధానమెఱుఁ గకుండునా? అతఁడుగూడ నీయస్త్రమునే ప్రయోగించిన సౌఖ్య

స్త్రంబులును బోరి తుదకు లోకంబులు భస్మంబులుగానొనర్చు. దాన మనము లోకోపకార మొనర్చుటకు బదులు లోకాపకార మొనర్చినవారమగుదుము. కాన నది సరియైనపనిగాదు. ఆంజనేయా! నీయభిప్రాయ మేమి?

ఆంజ—స్వామీ! విన్నవించెద.

చ॥ అరి యెదురైనవాని నెటు ♦ లైనను గూల్పఁగవచ్చుఁగాక శాం
బరి మెరయంగఁ బోరుగతి ♦ పచ్చెడు వాని వధింపనెట్టు? లీ
తరుణమునందు దానవుఁడు ♦ దానటువచ్చెడి చొప్పెఁదోఁచు ని
ప్పురుసున గట్టి రక్షణము ♦ బాయక చేయుట మేలు భూవరా!.

కావున మనవిభీషణుఁడు చెప్పెడి మాటలనుబట్టిచూడ వాఁడు మనల నెదిరించి పోరినఁ దానును వెనుకటివారి నే యనుసరింప వలసివచ్చునను భీతిచే నేదైనఁ గపటోపాయంబున మమ్ముఁ గికురించి మిమ్ముఁ గొనిపోవ నూహించినట్లు కాన్పించెడిని. లేకయున్న మిమ్మెదిరించిపోర వానివశమా? కాన మనము జాగరూకులమైయుండుట యుత్తమము. దీనికి నాకొక యోజన పొడకట్టుచున్నది.

శా॥ భూతవ్రాతము జోద్యమంది కనఁగాఁ ♦ బొల్పారు వాలంబునన్
జాతుర్యంబొదవంగఁ గోటనొకటిన్ ♦ సంధించియామీఁద ని
గ్భీతిన్ మిమ్ములనుంచి వాకిటను దో ♦ర్వీర్యంబుతోనుండ నే
రీతిన్ శత్రుఁడు మిమ్ముఁ జేరఁగలఁడీ ♦ రేయిన్ విచారింపఁగన్.

ఇట్లు సురక్షితులరగు మిమ్ములఁ దేఁచూచుటకునైన వైరి సమర్థుండుకాఁడు. ఇట్టిరాత్రిఁగడిపిన రేఁపటివిషయం బాలోచించుకొనవచ్చును.

రాము—ఆంజనేయా! నీవు చెప్పునది మిక్కిలి యుక్తియుక్తముగ నున్నది. అట్లేయొనర్తుము. అల్లదే! చండకిరణుండు చరమాద్రిఁ బ్రాపించుచుండె.

చ॥ కదనమునందు దానవుల ♦ ఖండితగాత్రులఁజేసి దేహమం
తదనుజరక్త మొప్పఁగను ♦ దద్దయురక్తిమఁజెంది వార్ధిలో
ముదమునఁగ్రుంక భానుఁడదె ♦ పోయెడిపశ్చిమవార్ధికింకన
య్యుదయమునుండి యీయినున ♦ దుగ్రపురక్కసిపోరె, నావలెన్.

ఇంక మనము సాంధ్యకృత్యంబులఁ దీర్చికొని మనయాంజనేయుండు సూచించినరీతి నీరేయి జాగరూకతతో వర్తింపుదము. సుగ్రీవా! మనవానరవీరుల నందర నీరేయి కడుజాగరూకులై యుండునట్లాజ్ఞాపింపుము. విభీషణా! నీవాదానవుని మాయల నెఱింగినవాఁడవగుటచే నీరాత్రినీవును నీవారును గడునప్రమత్తులరై యాదనుజుని రాకపోకలను గనిపెట్టుచుండవలయునుమా! ఆంజనేయా! నీవిప్పుడు చెప్పినరీతి తగుసన్నాహంబున నుండుము. మేమిదే సాంధ్యకృత్యంబులఁ దీర్చికొని వచ్చెదము. లక్ష్మణా! పోదమురమ్ము. [అందరు నిష్క్రమింతురు.]

ద్వితీయాంకము సంపూర్ణము.

శ్రీఆంజనేయార్పణమస్తు.





శ్రీ

శ్రీజానకీరమణసహాయం.

శ్రీ ఆంజనేయస్వామినేనమః.

# మారుతి విజయము.

## ప్రథమాంకము.

రంగము—సువేలాద్రి

[ఆంజనేయుండు వాలము వలయాకారముగా జుట్టికొనబడును.]

ఆంజ—ఇప్పటికి రాత్రియందొక యామముమాత్రమే గతించినది. ఇంక మూఁడుయామములు గడువవలె. ఇంతదనుక దానవుని జాడ యేమియుఁ గాన్పింపదు. ఇప్పటికే కాదిక ముందు మాత్రము!

ఉ॥ ఈవిధి నాదురక్షితులఁ ♦ నిమ్ముహి నాపద నొందఁజేయఁగా
నావనజాక్షు వాసవపు ♦ రాదులకైన నశక్యమింక నై
రావణుఁడేమి సేయునిఁక ♦ రాత్రియంతయుఁ గాచుచుండెదన్.
దేవవిరోధివచ్చినను ♦ నేరతనిల్చి కలంతునాజిలోన్.

కాని, జగదేకవీరులగు నీ మహాత్ములకుఁగూడఁ బగవారిభీతిచే నసదలవలె దాఁగియుండవలసె. అయ్యను! యెదుటనిల్చి పోరిన నెట్టివారినినైన జయింపవచ్చునుగాని చోరునిరీతి దొంగపోటున వచ్చువారి నెవ్వరు వధింపఁగలరు? కానిమ్మీరాత్రం డేమి చేయునో! చూచెదఁగాక. (అని కూరుచుండును.)

[దీర్ఘనాసికుఁడు, వక్రదంతుఁడు ప్రవేశింతురు.]

దీర్ఘ—అరే! వక్రదంతా! మనరాజుగారైన మైరావణచక్రవర్తి నేఁడీనరుల నిద్దరినెట్లులైనఁ దీసుకొనిరమ్మనుటకుఁ గారణ మేమి?

వక్ర—అరే! దీర్ఘనాసికా! బహుశా వీరిని కాళికకు బలియిచ్చునని తోఁచెడిని. ఇందాఁక మనచార్వాకునితో దేవినలంకరింపుమని యాజ్ఞాపించె.

దీర్ఘ—అటులనా? అయితే యీవేళ మనకు నరమాంసముదొరకునా? (అనినాలుక చప్పరించును.)

వక్ర—మనదాఁకావస్తుందటరా? ఎక్కడిది మనరాజుగారికేచాలదు.

దీర్ఘ—అయితే మనమీనరులను గొనిపోవుటవలన ఫలమేమిరా?

వక్ర—ఇందాక మనరాజుగారు చెప్పినమాటలు వినలేదురా? ఈనరులను తీసికొనివచ్చినవారికి గొప్పబహుమతిఁజేసెదనని.

దీర్ఘ—అట్లయిన నీనరులను గొనిపోవుటమిలెక్క. పోదముపద.

వక్ర—(మెల్లఁగా) అరే! ఆగుము. ఇచ్చటెవ్వఁడో కూరుచున్నాఁడు. వానరునివలెనున్నాఁడు.

దీర్ఘ—అరే! మనరాజుగారు మనలనెవ్వరికిఁ గనఁబడవద్దని చెప్పినారుకాదురా?

వక్ర—అవునురా. అరే! వీఁడెంతవానరుఁడురా. వీనికగుపడిన మనల నిద్దరిని నొక్కపెట్టునఁజంపును.

దీర్ఘ—అవునురా! మెల్లఁగా నీవైపునుండి పోదముపద.

(అని యిద్దరును నాంజనేయునికగుపడకుండ వాలపుచుట్టదరికిఁజేరుదురు)

వక్ర—ఇదేమిరా! మనలోకములోని పాముచుట్టవలె నున్నది.

దీర్ఘ—ఇది యీవానరుని తోఁకవలెనున్నది. అమ్మయ్యా! యెంత [illegible]

వక్ర—(బాగుగా పరిశీలించి) అరే! దీనికెక్కడా త్రోవ యున్నట్టు లేదే! తప్పక దీనిలో నానరులిద్దరున్నారురా.

దీర్ఘ—అవును. దీనికెక్కడయినా త్రోవయున్నదేమో చూడరా.

వక్ర—(చూచి) ఎక్కడాలేదుగాని! నేను మెల్లగాత్రోవచేస్తాను నీవు లోపలికి వెళ్ళుము.

దీర్ఘ—సరే కానిమ్ము.

వక్ర—(చుట్టనుసమీపించి చేతితో త్రోసి) అరే! దీర్ఘనాసికా! ఇది కదలునట్టులేదురా! (అని తన నోటిదంతములతో కదిలింపఁగా నవి యూడిపడును)

దీర్ఘ—నీచేత కాదురా? నేను సందుచేసెదను చూడు. (అని ముక్కుతో చుట్టను లేవనెత్తబోవును ముక్కూడిపడును.)

వక్ర—(బోసినోటితో) అయ్యో! నాపండ్లు.

దీర్ఘ—(బోసిముక్కుతో) అయ్యో! నాముక్కు.

ఆంజ—(స్వగతము) ఎచ్చోటనో సవ్వడి వినవచ్చుచున్నది. రాక్షసుండువచ్చి యుండనోపు. (వెనుకకుఁ దిరిగిచూచి) అదిగో! అచ్చటనో నల్లఁగా గార్ధ్రాగుళులవలె రెండువ్యక్తులు గాన్పించుచున్నవి. (లేచి ప్రకాశముగా) ఓరోరి రాక్షసాధములారా! నిలుండు నిలుండు మిమ్ము మదీయ ముష్టిప్రహారంబుల కెఱఁగా వించెద. కాచుకొనుఁడు.

దీర్ఘ—(భయముతో) మనము వీనికంటఁబడితిమి. వీఁడు మనలను బ్రతుకనివ్వడు ఏమిదిక్కు.

వక్ర—అరే మనము వీనికంటఁబడకుండఁ బరుగెత్తిపోదము పద.

ఆంజ—ఓరోరి పిరికిపందలార! పారకుఁడు, పారకుఁడు (స్వగతము) నేనిచ్చటనుండి కదలరాదు. కానిమ్ము దైత్యాధములేమి చేయుదురో చూచెదఁగాక.

[ సుగ్రీవుఁడు ప్రవేశించును. ]

ఆంజ—ఎవరక్కడ !

సుగ్రీ—ఆంజనేయా ! నేను సుగ్రీవుఁడను.

ఆంజ—అటులనా ! ఇప్పుడెంత ప్రొద్దుపోయినది.

సుగ్రీ—రెండవయామము గతించుచున్నది. ఇప్పటికి రాజపుత్రులు సురక్షితులేకదా ?

ఆంజ—ఆఁ ! ఇంతకుముందెవ్వరో రాక్షసులిరువురీ ప్రాంతమునకు వచ్చిరి. నన్నుఁగని పాఱిరి. ఇచ్చట విడిచివెళ్లుట కూడదని యూరకుంటిని.

సుగ్రీ—అటులనా ! అటులైన దానవుండేదియో యత్నమొనర్చుచుండెనని యే తోచెడిని. కావున నీవతిజాగరూకుఁడవై యుండవలయునుసుమా !

చ॥ అరయఁగ రామభక్తుఁడవు ♦ నై యలరారెడి నీకు వేరుగాఁ
గఱపఁ బనేమిలేదయినఁ ♦ గార్యముఁబట్టి వచింతు నిప్పు డే
మఱక నృపాలపుత్త్రులను ♦ మానుగ రక్షణఁ జేసి పిమ్మటన్
ధరణిపు మన్ననల్ వడసి ♦ తద్దయుఁగీర్తిఁ జెలంగుమా వెసన్.

మఱియు

మ॥ వెనుకన్ జేసిన నీమహిక్రమములన్ ♦ వేమాఱుఁజిత్తంబులం
దునభావింపుచు విస్మయాత్ములగుచున్ ♦ దోరంబుగా బొంగుచుం
డిన నీవారలు నేఁడుగూడ నినుదం ♦ డిన్ స్తోత్రముల్ జేయుని
య్యానవంశోత్తముఁ గాచుమా! కపికులం ♦ బేపారు కీర్తిన్ గనన్.

మేమందరముఁ గూడ నీరేయి నీకీతిగనే వచ్చుచున్ పోవుచుండెదము. నేనిదే పోయివచ్చెద.

ఆంజ—సుగ్రీవా ! యింతగాఁ జెప్పవలెనా ?

మ॥ అరయన్నాదగు బాహువప్రబల ర ♦ క్షాధీనులన్ జేరఁగా
గిరిజానాథునికైన శక్యమగునే ♦ గీర్వాణులెల్లన్ గనన్

ధరణీనాథుల నేఁడుగాచెదను దో ♦ ర్దర్పంబునన్ వచ్చునా
సురవైరిన్ ధరఁగూలవైచి వెసనేఁ ♦ జూపింతు మద్వీర్యమున్

కావున మీరెల్ల రీరేయిదాశరథులఁగాచు భారము నాపైనిడి సుఖసుప్తిన్ జెందుఁడు. ఒకవేళ నా దైత్యుండు నన్నుఁగూడఁ గికురించి రాజపుత్రులఁగొని పోపునేమోయను భీతికల్గిన నిటు వినుండు.

శా॥ లోకాలోకపరీతభూభువన ము ♦ ల్లోలంబుగా వార్థిలో
నేకంబౌ గతిఁ గల్పివైచెద దివిన్ ♦ హేలాగతిన్ జించెదన్
లోకానుగ్రహవేషు రామునిఁక నే ♦ లోకంబునన్ దాచినన్
నాకద్వేషిసడంచి సోదరునితో ♦ నాభూవరున్ దెచ్చెదన్.

కాన మీరాసంశయంబుఁగూడ వీడినిశ్చింతతో నుండుఁడు.

సుగ్రీ—ఆంజనేయా! నీవట్టివాఁడవేయగుదువు. రాజపుత్త్రులఁ గాచు భారమంతయు నీదేయయినను స్వామిభక్తిఁజూపుటకై యప్పు డప్పుడు నిన్ను హెచ్చరించుటకై వచ్చుచుందుము. దానికి నీవు గనలవలదు.

ఆంజ—భానుజా! నేనేమరుపాటున నుండకుండ నన్నుచ్చరించుటయు మంచిదే. కాని భృత్యుఁడనగు నేనుండ రాజవగు నీకేల. శ్రమయనికాని మఱొక్కటి కాదుసుమా.

సుగ్రీ—వాయుజా! నీవు నాకు భృత్యుండవనుకొను దినంబులుగతించె నీబాహువిక్రమం బెఱుంగక నిన్ను సామాన్యునిగాఁ దలంచి నప్పుడు నిన్ను భృత్యమాత్రునిగాఁ జూడవలసె. కాని నీవిప్పుడు రామకార్యార్థమొనర్చిన యమానుషకృత్యంబులఁ గని వినిన నాటినుండియు నిన్ను భృత్యమాత్రునిగాఁ గాక కపికోటి కంత కును బ్రభువుగాఁ దగుదువని దలంపేర్పడె. అదియునుగాక నాస్వామియగు రామచంద్రుననకు నీ వత్యంతాప్తుఁడవగుటచే నిన్నాతఁడు సోదరతుల్యునిగా మన్నించుటఁజేసి మేమును

"యథారాజాస్తథాప్రజా" యను సామ్యంబుగ నిన్ను నారీతిగనే మన్నింపవలయు. అట్టియెడ నీవు మాకు భృత్యుండ వెట్లగుదువు. పరేంగితజ్ఞుండవగు నీవాడుపలుకులయందెన్నటికిని బరుల మనంబుల నొప్పించు పలుకులుండునే? ఇఁక నేబోయివచ్చెదఁ. జాగరూకుండవై యుండుము.

ఆంజ—సుగ్రీవా! నావిషయంబున నీవెన్నటికిట్లుగాఁ దలంపవలదు. నేనెప్పటికిని నొక్కతీరువాఁడనే. నీవు మాకు ప్రభువువును మాన్యుండవును. నేనెప్పటికిని నీకు భృత్యుండనై యుష్మదాజ్ఞానువర్తినై మెలంగెద.

సుగ్రీ—నీభక్తికి సంతసించితిని నేబోయివచ్చెద. (నిష్క్రమించును)

(మైరావణుని ప్రవేశము)

మైరా—నేనుపంపిన రాక్షసులిరువురుఁ గార్యసాఫల్య మొనర్పలేక పోఁగా పైపెచ్చు భగ్నావయవులుఁగూడనైరి. లేకున్న వీరలచే నీకార్యమగునా? (పరీక్షించి) నేఁడీకపిసైన్యమంతయు గడుఁ జాగరూకతతో మెలఁగుచున్నది. నేనదృశ్యరూపుండనై వచ్చుటచే వీరు నన్నుఁగనిపెట్టఁజాలరైరి కాని వీరిలో నాసను లిద్దరున్నట్టుగాన్పింపదు (ముందుకుఁజూచి) ఇదిగో! వక్రదంతుఁడు చెప్పిన వాలపుఁజట్టయిదిగో (సమీపించిచూచి) దీని కెక్కడను దారియున్నట్టు గాన్పింపదు (ఆలోచించి) నేను వారివలె నీచుట్టను భేదించుటకుఁ బ్రయత్నింపకేదేని మాయోపాయంబునఁ గార్యంబు సాధింపయత్నించెద. (అనిపరికించిచూచి) అదిగో! యావానరుని ప్రక్కను మాత్రము కొంచెము దారి యున్నట్టు గాన్పించుచున్నది. వీఁడేకాఁబోలాంజనేయుఁడు. వీని పరాక్రమమునుగురించి యిదివరకే కొంతవినియున్నాఁడను. వీఁడనన్యసామాన్య విక్రముండఁట. నేనిప్పుడు వీని నేవిధంబున మోసపుచ్చవలె? (యోచించి) బళే! మంచియోజనపొడఁగట్టె

నది. "ఏకక్రియాద్వ్యర్థ్యకరీబభూవా" అన్నశ్లోకపనిచే రెండు కార్యములు సమకూరఁగలవు. ఇప్పుడు నేను విభీషణరూపముఁ గైకొనిన వీరు తప్పక మోసపోయెదరు. దానివలన లోనికిఁ జని యీనరుల నిచ్చటఁ గొనితెచ్చుటయొకటి. ఇఁక రెండవది విభీషణుఁడు మాదానవులవీడి యీనరుల నాశ్రయించి మా కులంబునకు నపకీర్తి తెచ్చెఁ గావున వీనిరూపముతో వీరలఁ గొని చనిన వీఁడే యీపనినొనర్చెనని నమ్మి వీని గడతేర్తురు. దాన రెండవకార్యముఁగూడ సఫలముకాఁగలదు. భేష్! ఇట్లుండవలె. మైరావణుఁడు తలఁచినకార్యంబున కెప్పుడైన విఘ్నముండునే? అట్లొనర్చెదఁగాక (అని నిష్క్రమించి మరల విభీషణరూపముతోఁ బ్రవేశించి) ఆంజనేయా! ఇప్పటికి రాత్రియందు రెండుయామములు గతించినవి. ఇఁక నీ రెండుయామములు వీరి నెటులైనఁ గాపాడిన నిఁక భయంబులేదు. కాని

మ॥ కరుణాదూరుఁడు పాపచిత్తుఁడును దు♦ ష్కార్యక్రమాధుర్యుఁడున్
నరమాయావిదుఁ డిద్ధకోపనుఁడు న♦ ద్యారుండు మైరావణుం
డు నానావిధ వేషుఁడై తిరుగు నీ♦ యుర్వీస్థలిన్ గాన ని
త్తరినామాయకు లొంగకుండకయ యీ♦ ధాత్రీశులన్ బ్రోవుమా!

ఏదీ తెలుపుమమ్మ. వారల నొకపరిజూచివచ్చెద (ఆంజనేయుండు తెలుపఁగను లోనికిఁజని రామలక్ష్మణులున్న పేటికతోఁ బ్రవేశించి) ఆంజనేయా! నేపోయివచ్చెద జాగ్రత్త సుమా!

ఆంజ—మంచిది పోయిరమ్మా.

మైరా—అమ్మయ్యా! ఇప్పటికి వీనికండ్లలో మన్నుగొట్టి కార్యసాఫల్యమొనర్చుకొంటిని. ఇఁకమీఁదటి కార్యమునకై యోజింపవలె. కాని కార్యమింత సులభముగా సమకూరునని నేమొదట ననుకొనలేదు. కోఁతిని మూఢుఁగావించెన. (నిష్క్రమించును

(సుగ్రీవుఁడు, విభీషణుఁడు ప్రవేశింతురు)

సుగ్రీ—ఆంజనేయా!

ఆంజ—ఎవరక్కడ?

విభీ—నేను విభీషణుండను. ఈయన సుగ్రీవుఁడు. జాగరూకుఁడవై కాచుచుంటివా?

ఆంజ—ఏమీ! విభీషణా! నీవిప్పుడేగద యిచ్చటికివచ్చితివి. మఱల నింతత్వరలో వచ్చుటకు గతంబేమి!

విభీ—ఆఁ నేనీరేయి నింతదనుక నిచ్చటికి వచ్చియేయుండలేదు. ఏదో! మోసము జరిగియుండనోపు. ఆంజనేయా! తెలువిమ్ము (అని లోపలికిఁజని మరలప్రవేశించి) మోసము మోసము! (అందరు నివ్వెఱపడి చూచుచుందురు)

ఉ॥ మోసముఁజేసి రాములను ♦ ముచ్చిలిపోయెను దైత్యుఁడింక నా
వేసముతోడ వానిఁదగు ♦ వేసముఁగన్గొనఁ జాలనైతివో
కేసరిపుత్త్రి! నేఁడిటుల ♦ క్లేశముఁబొందితి మిందరుండియుఁ
మోసముఁగానలేక కదు ♦ మోహితులైతిమి వానిమాయచేఁ.

ఆంజ—ఆఁఏమీ! రామచంద్రుని గొనిపోయెనా? హా! రామచంద్రా! (అని మూర్ఛిల్లును)

సుగ్రీ—ఎంత మోసముజరిగినది. హా! రామచంద్రా!

ఆంజ—(మూర్ఛదేఱి) హా! రామచంద్రా! సద్గుణసాంద్రా! కౌసల్యాగర్భజలధిరాకాసుధాకరా! అయ్యో! మేమిందరమింత జాగరూకతతో నిన్నుఁగాపాడుచుండినను నిన్నా దైత్యుండు మాయఁజేసెనే! రాకాసుధాకరబింబంబువిడంబించు నీముఖబింబంబు మఱలఁ జూచుభాగ్యంబు నాకుఁగల్గునే! అయ్యో!

శా॥ రాకాచంద్రు నిరాకరించుముఖముల్ ♦ రాజీవసామ్యంబులౌ
నాకన్నుంగవయుల్ వెడందయురమా ♦ హా! గొప్పలౌ బాహులుల్

శ్రీకారాకృతిమించు కర్ణములతోఁ ♦ జెల్వొందు నీరూపముఁ
నాకీకన్నులకింకఁ జూచుసుఖమ ♦ న్నా! నేటితోఁదీరెనే!

మఱియు

ఉ॥ పాతకుఁడైన రావణుని ♦ బాధలదీనతనొందియాసుర
వ్రాతముఁదన్నువేడఁగను ♦ రక్కసుఁజంపగ భూమియందు సం
జాతమునొందినట్టి దను ♦ జాంతకుఁడంచును నిన్నుఁదెల్పు నా
పూతచరిత్రులైన ముని ♦ ముఖ్యులమాటలు రిత్తవోయెనే?

మఱియు

మ॥ పదునాల్గేండ్లు గతించునాటికిఁక నీ ♦ పంతంబుచెల్లించి స
మ్మదమేపారఁగ బట్టణంబునకు సా ♦ మ్రాజ్యాప్తికై రానిచో
సదయుండా భరతుండు ప్రాణముల ని ♦ స్సందేహతఁ బాయునే
కద! యాధన్యునికేమి చెప్పితివి నీ ♦ కై ప్రాణమీకుండఁగఁ.

అక్కటా! దానవునింటఁ బడరాని యిడుములఁగుడుచుచు నెన్నటికయిన నాముక్కడిరక్కసు నుక్కడించి తన్నుద్ధరింతువని గంపెడాసతో నెదురుఁజూచు నాపూతచరిత్రయగు సీతాదేవికేమిచెప్పితివి? జగదేకవీరుండవగు నీవనదరీతి నొక్కడై త్యాధముని మాయకిట్లు జిక్కవలసివచ్చెనే? అయ్యో! లక్ష్మణా! నీకిన్నియు గండముఃలేగదోయీ! మొన్న నారావణునిశక్తి ప్రహారంబుచేఁబడిన నిన్నట్టులో బ్రదికించుకొంటినిగదాయని సంతసించుచుండ నింతలో నిదియొకటిసంప్రాప్తమయ్యెనే?

సుగ్రీ—ఆంజనేయా! నీవీరీతిగ దుఃఖింపుచుండిన నేమిలాభము! ముందు జరుగఁదగుదానికై యోజింపవలయునుగదా? ఈ రేయి సీయొద్ద కెవ్వరెవ్వరువచ్చిరో తెల్పుము.

ఆంజ—నీవొకసరివచ్చితివి. విభీషణుఁడొకమారువచ్చె. నింకెవ్వరును రాలేదు.

విభీ—అయ్యో! నేనా? నేనురాలేదే.

నేనట్టివాఁడనేమైనచో

సీ॥ మాయసీతను దెచ్చి ♦ మా మేఘనాధుండు
తల ద్రుంప వెతఁజెంద ♦ దెలుపలేదె?
మిముఁగూల్ప దనుజుండు ♦ మేటిహోమముఁజేయఁ
గనిదానిఁజెరుప మిమ్మనుపలేదె?
మావారిగుట్టంత ♦ మహిమీకు నెఱిఁగించి
ప్రీతితోవారి జం ♦ పింపలేదె?
మైరావణుఁడు నేఁడు ♦ మనలను వంచింపఁ
బ్రతినఁజేసెనని జె ♦ ప్పంగలేదె?

తే॥ గీ॥ అనుదినంబును మావార ♦ లరయమిమ్ము
నెన్నిమాయలఁజేసిన ♦ నెఱిఁగి తెలుపఁ
బట్టియేకద విజయముల్ ♦ బడసినారు
దానినైనను మనమందుఁ ♦ దలఁపవలదె.

నాకట్టిదుశ్చింతయే యున్నయెడల మీరీలంక వైపునకైన దేరి చూడఁజాలరు నేనుజన్మముచే రాక్షసుఁడనైనను నీవలె నేనంత ద్రోహినిగాను.

సీ॥ అన్నవాకిటనుంచి ♦ యసురులతోఁబోరంగ
బెద్దరాతినినన్ను ♦ పెట్టలేదు
అగ్రజుండు గతించె ♦ ననిలోన దైత్యుచే
నని వానిరాజ్యంబుఁ ♦ గొనఁగలేదు
అనిలోన నన్నదా ♦ వెనుకొనభయమంది
దిశలన్ని గతిలేక ♦ దిరుగలేదు
పరుని సాయంబున ♦ భ్రాతను బరిమార్చి
వానిభార్యను గొని ♦ వఱలలేదు

తే॥ గీ॥ అడుగు నలుపునుగానక ♦ యలదిరియురుల
కేగరించెడి గురువింద ♦ గింజరీతి

నిన్నియును జేసి తనతప్పు ♦ తెన్నుగొనక
పరుల ద్రోహులటంచని ♦ బలుక లేదు.

నేననినచో—

మ॥ ధరణీభార నివారణార్థమయి ♦ దైత్యశ్రేణిమర్దింప ని
ర్ధరణిన్ బుట్టువు నొందినట్టి యల శ్రీ ♦ దైత్యాంతకుండంచు నీ
ధరణీనాథుని రాముఁగూర్చి మునుల ♦ త్యంతంబుగాఁ బల్క నీ
తరుణంబందున రాముఁ జేరితిని స్వాం ♦ తంబందు మోక్షార్థినై.

అంతేగాని నీవలె స్వలాభంబుఁ గోరి యన్నను వధియించి యతని రాజ్యంబుగొన నుద్దేశించి కాదు. రావణుఁడు లోకాపకారి యనుటదక్క వానియందు నాకు వేరుకారణంబు లేదు. లోకకంటకుండగువాఁడు సుతుండైనను వధార్హుండనునార్యోక్తి ననుసరించి దైత్యుల వధియించుటలో రామునికి సాయమొనర్చితిని.

సుగ్రీ—ఓరీ! కృతఘ్నదాంధా! మర్యాద నతిక్రమించి ప్రేలుచున్నగే మదీయముష్టి ప్రహారంబున కెఱఁగావించెద.

(అని కొట్టుటకు పోవుచున్న)

ఆంజ—(అడ్డుపడి సుగ్రీవునొక చేతను విభీషణు నొకచేతను బట్టుకొని) సుగ్రీవా! శాంతింపుము. విభీషణా! ఎన్నడును బలుకరాని పలుకుల నొప్పించి యేమిటికని నీవీతి నిష్ఠురవాక్యంబులాడెదవు? ఇట్లు మనలో మనమే కలహించుచుండిన నేమనవలె? రామచంద్రుఁడు పగతునిచేఁ జిక్కి సీతరుణంబున ముందుజరుగవలసిన దానిని యోజింపక కీడుఁ గలహించిన నేమిలాభము? కావున శాంతించి జరుపవలసిన దానిని యోజింపుఁడు.

విభీ—ఆంజనేయా! నేనేమిచేసితిని! నిరంతరరామపదచింతనాపరుండనగు నన్నిరీతి రామచంద్రుని ద్రోహంబున కాత్రవున కప్పగించితి ననుటపాడియే!

సుగ్రీ—ఆంజనేయా! నీవసురుల మాయల నెఱుఁగజాలవు. వీడుఁ తప్పక రాఘవుల వైరికప్పగించెను.

ఆంజ—సుగ్రీవా! అట్లెన్నడును దలంపవలదు. విభీషణుఁ నే నాది నుండియు నెఱుంగుదును. ఈతడు దక్కినరక్కసులలో గణింపఁ దగినవాఁడుకాఁడు. నీమనంబున సంశయంబును వీడుము.

సుగ్రీ—సరే! నీ యిష్టము.

ఆంజ—విభీషణా! ఇఁక ముందు జరుగవలసిన దేమి?

చ॥ అనఘుఁడు రామచంద్రుఁడటు ♦ లాపదనొందె విరోధిచేత మీ
మనముల దానినెంచకయె ♦ మానుగఁ బోరదొడంగినారదే
ఘనమనిదోఁచె మీకరయఁ ♦ గావున వేఁడెదఁబోరుమాని నీ
యనువునసెట్లు శత్రువిధ ♦ మారయునచ్చునో! చింత సేయుఁడీ!!

సకలదానవ మర్మవిదుండవగు నీకుఁ దెలియనిదేమియు లేదు. ఏయుపాయంబుననైన రామచంద్రు నపాయముగా బొరయకుండ రక్షింపవలయు. గావున నీవిక మాసుగ్రీవునిమాటలకుఁ గినియక కర్తవ్యమాలోచింపుము.

వి—ఆంజనేయా! నీవింత చెప్పవలయునా? యీ సుగ్రీవులో నేమి. రామచంద్రుని రక్షించుకార్యమందరికిఁ గావలసినదె. దానికే యోచించుచుంటిని. ముందా దానవుని పురంబుఁ జేరుటయే ముఖ్యము. ఆపట్టణంబునకు మార్గంబెట్టులన.

మ॥ కలదీలంకకు బశ్చిమంబునను శౌ ♦ గ్యైనట్టి యుద్యానమా
వలఁగాన్పించెను దానమధ్యకొలన ♦ వ్వారి ప్రపూరంబునన్
గలదబ్జంబు మనోహరంబగుచు నా ♦ కంజంబునన్ దోచ్చి యం
దలి నాళంబున సూక్ష్మరూపియగుచున్ ♦ దాఁబోవఁగాన్పించెదున్!

ముందివ్విధంబున నిన్నిటి నిర్గమించినఁగాని వానిపురంబును జేరలేము. చేసనేమానా! లోనికిజనుటదుష్కరము.

గునిలంకయందుకంటె వానిలంకయందిబ్బడి రాక్షససైన్యంబు కలదు. వారెల్లప్పుడు గడునప్రమత్తులరై యుప్పట్టణంబుగాచు చుందురు. వారల వధియించి లోనికిజనినను రాఘవులజాడ లరయుట బహు దుర్ఘటము. ఇక మైరావణుండన్ననో రావణునికన్న బలపరాక్రమములయం దధికుఁడు. విరించిచే సంగరంబున శస్త్రాస్త్రంబులఁ జావకుండ వరంబులందెఁ గాన వానిని యుద్ధంబున గడతేర్పవలెనేకాని శస్త్రాస్త్రంబులఁ జావఁడు. కావున మనయందు బాహుబలధైర్యస్థైర్యంబులయం దధికుం డగువాని నిప్పనికి నియమింపవలె. అట్టివానికై యోజింపుఁడు.

సుగ్రీ—ఇంతటికార్యమొనర్పఁగల ధీరులీ వానరసైన్యంబునఁగలరా?

ఆంజ—ఇది సాధ్యమగుపనికాదు.

విభీ—ఆజనేయా! ఈపని నీకుఁదప్ప నితరులకు సాధ్యమగునా?

సీ॥ ఉదయించు నాఁడెయ ♦ యుదయార్కుఁ గన్గొని
ఫలమని బట్టిన ♦ భవ్యమతివి
విశ్వరూపముఁ దాల్చి ♦ వేఁడివేలుపునొద్ద
విద్యలునేర్చిన ♦ విమలమతివి
జానకీసతిఁగాంచ ♦ శతయోజనాబ్ధిని
క్షణములో దాటిన ♦ సత్వనిధివి
లెక్కకు మించిన ♦ రక్కసులను ద్రుంచి
సంజీవిఁ దెచ్చిన ♦ శౌర్యనిధివి

తే॥ గీ॥ తలఁప నీకసాధ్యంబు లీ ♦ ధరణిఁగలవె?
నేఁడు మమ్ములఁదయఁజూచి ♦ నేర్పుమీఱ
రామచంద్రుని రక్షించి ♦ భూమి నేరి
కందరానట్టి కీర్తిని ♦ బొందుమయ్య!
కావున నీవుదక్క మఱెవ్వరివిపదంబుధినుండి దాటింపనింకొరులు సమర్థులుగారు.

సు[గీ—(తనలో) ఈమహాత్ముని కోరుటెఱిఁగించినగాని దనసత్వంబె ఱుంగనేరఁడు.

ఆంజ—(విజృంభించి) నిజము విభీషణా ! నిజము.

ఉ॥ ఏఁగలుగంగ రాఘవుల ♦ నెట్టివిపత్తులుఁ జేరనేర్చునే ?
వేగమపోయి దానవుని ♦ వేడబమంతయుఁ దూలఁజేసినే
నాగడిదొంగఁబట్టి పరి ♦ మార్చెదఁ దెచ్చెదరాజపుత్త్రులన్
ఈగలి శోకమందుటది ♦ యేటికిఁ జూడుఁడి మత్ప్రతాపమున్.

మఱియు

శా॥ గాలింతున్ దిశలన్ని క్రోధమడర ♦ గారింతు దైత్యాళిను
న్మాలింతున్ గులపర్వతంబులను ని ♦ ర్మూలింతు లోకంబులన్
దూలింతున్ సురకోటి భీతిఁబఅవన్ ♦ ఘోరంబుగా నేఁడు నే
సోలింతున్ గ్రహతారకాది గణమున్ ♦ జూపింతు మద్వీర్యమున్.

విభీ—అందుకు సందియమేమి. నీవు నిక్కంబుగాఁ దలంచిన నీకసాధ్యంబెద్ది ? కాని "ఆలస్యా దమృతంవిషం"బన్నట్లు కార్యమాలసించినఁ జెడును.

చ॥ త్వరపడుమయ్య కార్య మది ♦ తప్పునొ! యేమొ! గరాసిచూడ భూ
వరు నటుగొంచుఁబోయెఁ గడుఁ♦ బాతకుఁ డాతఁడిఁకేమిసేయునో !
కరుణ యొకింతఁ డించుకయుఁ ♦ గాలముభ్యర్థము సేయకుండ నీ
వరిగినగాని లేనిమెడ ♦ నాపుట కష్టముసుమ్ము వారలన్.

కావున సత్వరంబు చనవలయు.

ఆంజ—ఇదే పోయివచ్చెద, మీరిక్కడ జాగరూకులై యుండుడు. సు[గీవా! ఇఁక నేనరుగుదునా ?

సు[గీ—పోయి కార్యసాఫల్య మొనర్చుకొనిరమ్ము.

మ. కడు మాయావియటంచు విందుమతనిన్ ♦ గార్యంబు సాధించుచుం
డెడి పట్లాతనిమాయలోఁబడక నీ ♦ డెందంబునన్ భ్రాంతి కె

ప్పుడు దావియ్యక జాగరూకతను సం ♦ పూర్ణంబుగాఁ గార్యమిం
పడరఁగ జేయుచు మాకునెల్లఱకు నీ ♦ వానందముఁగ గూర్పుమీ!
కార్యంబు సాధించునప్పు డెంతవానికైనను భుజబలంబొక్క
దానిచేఁ గార్యంబు సఫలంబుకానేరదు. చతురుపాయంబులు
వలయు. సకలరాజనీతి కోవిదుఁడవగు నీకు నెఱిఁగింపఁ బనిలేదు.
కావున గడుసప్రమత్తుఁడవై కార్యంబు సాధించి రాఘవులం
దోడ్తెమ్ము. నిన్ను సకలదేవతలును రక్షింతురుగాక. నీజనకుం
డగు వాయుదేవుండు నిన్ను రక్షించుగాక. మేమేగి వానరులు
కలఁగకుండ నేర్పాటుఁ గావించెదము. నీవిఁక పోయిరమ్ము.

విభీ—ఆంజనేయా! దానవుని పురంబునకేగు మార్గంబు తెలంగఱిం
గించితినిగదా. అయ్యది నీమనంబునందిడి జాగరూకతతో కార్య
సాఫల్యమొనర్పకొనిరమ్ము, (సుగ్రీవవిభీషణులు నిష్క్రమింతురు)

ఆంజ—(ముందుకువచ్చి) ఆహా! ఇప్పటికి రాత్రిమూడు యామ
ములు గతించుచున్నవి. ఇచ్చటికి కామాయుదారి రక్కసుఁడు
వచ్చి యొక్క ముహూర్తము కానచ్చినది. వాఁడేమైన
పాపచింతనకుఁ బొరఁడుగదా! (ఆలోచించి) భగవంతుండగు
రామచంద్రుఁడేమి చేయఁగలఁడు. అయిన నేను బోవుచుంటిని
గదా! (యోచించి) ఇంతటికార్యంబు నావలన గాఁగలదా!
ఆఁ! ఏమీ! శ్రీరామచంద్రుని యనుగ్రహంబున్నచో నాకిది
యొకలెక్క!

కవిరాజ విరాజితము.

పరమదయాకర - పాపభయంకర -పద్మజసేవిత - పాదయుగా।
సురమునిపూజిత - సూరిజనావన - శోషితదానవ-దోషహరా।
పురహరరక్షక - భూరికృపాకర-మోక్షవినాయక-భూమిధరా।
నరగుసబ్బోవుము - సారెకునిన్నిదె - సన్నుతిఁజేసెద -చక్రధరా॥
ఇఁక నేనాలసింపఁజనదు. పోయెద (అనినిష్క్రమించును)

తృతీయాంకము సంపూర్ణము.



శ్రీ

శ్రీకాకుళరమణసహాయం.

శ్రీ ఆంజనేయస్వామినేనమః.

# మారుతి విజయము.



## —♦ చతుర్థాంకము ♦—

### ప్రథమరంగము.

రంగము—సరోవరము.

[ఆంజనేయుఁడు ప్రవేశించును.]

ఆంజ—(ప్రవేశించి) ఆహా ! ఏమీ ? యీతటాకరామణీయకము.

మ॥ శరముప్పారెడి నీసరోవరము చ ♦ క్రాంగాది నానాద్విజ
స్ఫురణంబొల్పుచు చంద్రకాంతపు శిలా ♦ సోపానముల్గల్గి భా
స్వర వజ్రోపలసైకతంబులఁ బరం ♦ సౌవర్ణపంకేజ వి
స్ఫురమై కన్నులకింపుగాఁ బొల్పెడినహో ! ♦ చోద్యంబుగానుండటన్ .

ఇయ్యదియే కాఁబోలు ! విభీషణునిచే నిర్దేశింపఁబడిన కొలను. దీనియం దా సువర్ణపద్మంబు నెమకవలయును. (పరికించిచూచి) అల్లదే కన్నులకింపగుచు సువర్ణ కోణంబులుగల్గి చుక్కలయందుఁ జంద్రునిగతి గన్పట్టెడిని.

ఉ॥ చుక్కలయందు చంద్రుగతి ♦ శోభిలుచున్నది పుష్పరాజిలో ।
నక్కజమైనకాంతినల ♦ రారెడి దీనసరోవరంబు నం ।

పెక్కు నశోభ జెందెడిని ♦ నేనిఁక వేగమే సూక్ష్మరూపినై ।
యిక్కమలంబుఁ జొచ్చితిన ♦ యేని సురారిపురంబు కన్పడున్.

అట్లొనర్చెదఁగాక (నిష్క్రమించును)

---

## ద్వితీయరంగము — పాతాళలోకము.

[ఆంజనేయుని ప్రవేశము]

ఆంజ—(ప్రవేశించి) ఎట్టకేలకు నేనిప్పుడు పాతాళలోకముఁ జేరితిని. ఆహా ఎమీ! యీరసాతలప్రభావము.

సీ॥ హాటకేశ్వర జటా ♦ జూటాగ్రసంస్థిత
శుభ్రాంశుకిరణ సం ♦ శోభితంబు
బలిసద్మరక్షక ♦ పద్మాక్ష ఘనవక్ష
కౌస్తుభదీప్తి ప్ర ♦ కాశితంబు
ప్రక్షాళనోద్వేల ♦ పాపక్షయాంచిత
భోగవతీ జల ♦ పూరితంబు
మూర్ఖసగరసుతో ♦ న్మూలనోన్మూల న
ప్రౌఢకపిలతపో ♦ రక్షితంబు

తే॥ గీ॥ సంకటహరంబు రోగభ ♦ యంకరంబు
పాపరహితంబు పుణ్యప్ర ♦ దీపితంబు
అర్థసహితంబు ధర్మసం ♦ వర్ధనంబు
గాంచఁగలిగె పాతాళలో ♦ కంబు నేఁడు!

ఈలోకవాసులకు రోగభయంబుండదు. (పైకిచూచి) అప్పుడే సూర్యోదయమైనట్టున్నదే? అయ్యో! పొరఁబడితిని. ఈ సూర్యబింబదర్శన మెక్కడిది? ఈలోకంబున రాత్రింబవళ్లను భేదమెక్కడిది! సంతతంబీ లోకవాసులగు నురగపుంగవుల శిరోరత్నంబుల దీప్తియే పట్టపవలుగా నొనర్చుచుండు (ప్రక్క

కఱజూచి) అల్లదే భోగవతీనది. భగవతియగు భాగీరథీ లోకంబున, భోగవతీ నామంబునఁబ్రవహించుచు నీలోకవాసుల పాపంబులనుండి యుద్ధరించుచున్నది.

మ॥ హరిపాదంబున జన్మమంది హరజూ ♦ టాగ్రస్థలిన్ నిల్చి దాఁ
గరుణన్ లోకములెల్లఁ బ్రోవఁగను నా ♦ కంబందు మందాకినీ
వరనామంబున బూజఁగొంచు ధరణిన్ ♦ భాగీరథీనామమై
బరగెన్ భాసిలుచుండు భోగవతి నా ♦ పాతాళలోకంబునన్.

అల్లదే! ఈయెడమవైపునఁ గాన్పించునదే విభీషణవచనానుసారంబుగా దానవుని పురంబుగానవచ్చు. ఇఁక నేనచ్చటికేగి కర్తవ్యమాలోచించెదఁగాక.

## తృతీయరంగము.

రంగము—మైరావణుని కొలువుకూటము.

(మైరావణుఁడు, సుచరిత్రుఁడును, వ్యాఘ్రవక్త్రుఁడు ప్రవేశింతురు.)

మైరా—అమాత్యశేఖరులారా!

ఉ॥ ఉరగులు పాయసంబులను ♦ నూర్జితరీతి గ్రసంగుచుండిరే!
గనువముపీశ పక్షులు ♦ కామిత వస్తు చయంబులిత్తురే!
యరసురలో దానవుల ♦ హర్మ్యతివారి మెలంగుచుండిరే!
కొఱతలిఁకేమి లేవుగద! ♦ కోవిదులార! యెఱుంగఁజెప్పరే?

సుచ—అప్రతిహతప్రతాపులగు దేవర భుజాసంరక్షితులమగు మాకే కొఱంత లేలగల్గెడిని.

తే॥ గీ॥ ఉరగు లతిభక్తిఁ గప్పంబు ♦ లొసఁగినారు
భయమున భజింపుచుండిరి ♦ పన్నగేంద్రు
లసురు లాహ్లాదయుక్తులై ♦ యలరుచుండి
నిరుపాధిఁ గొఱంత లిఁ ♦ కేలగల్గు!.

మైరా—మంచిది. ఇంతటను రాజ్యకళాధురంధరులగు మీవంటి మంత్రిపుంగవులుండఁబట్టియే సర్వంబును నిర్విఘ్నంబుగ సాఁగు చున్నది.

తే॥ గీ॥ అధిపుఁడెంతటి కార్యజ్ఞుఁ ♦ డైనఁగాని
మహితకార్యగతులుఁ దెల్పు ♦ మంత్రివరుఁడు
లేని యెడవాని రాజ్యంబు ♦ లేశమైన
వృద్ధినొందంగఁ జాలదు ♦ వేయునేల ?

వ్యాఘ్ర—ఇదంతయు దేవరయనుగ్రహమె. దేవా! దేవరయాజ్ఞ యెల్లెడల నిరాతంకముగాఁ గొనసాగుచున్నది; కాని బలి యొక్కండు మాత్రము

తే॥ గీ॥ బలియుఁడనటంచు ♦ పద్మాక్షు ప్రాపుదనకుఁ
గలదటంచును దఱవోసి ♦ గర్వమునను
సరకుసేయఁడు మునులను ♦ హాళిభజించి
నలువుఁ గావించె రాక్షస ♦ కులము నెల్ల.

వీఁడు మిక్కిలి మనమొనర్చు కార్యంబులన్నియు దూష్యంబులని యాక్షేపించుచుండు.

మైరా—అవు నాసంగతి మాకును దెలియును. మునిస్తోకత్వమున మునివాఁడే కదా! యను తలంపున నాతనిఁ జూడఁబోయితిని. కాని యందందు నెక్కొనిన క్రూరాత్ము గృహద్వారంబున విష్ణుఁడు కాని కృష్ణుఁడుగాని నాకుఁ గనిపింపలేదు. లోనికిఁ బోవ నాతండు నన్నెంతయో మన్నించెను. కాని నేనొనర్చునవి యెల్లయు నిష్టకార్యంబులనియు, మునులను హింసింపరాదనియు భగవంతుండగు విష్ణుని భజింపవలయు ననియు, నేవో నోటికి వచ్చినట్లెల్ల వదరఁ దొడఁగెను. నేనును నుచితరీతిని నుత్తరం బొసఁగి వచ్చితిని.

సుచ—"తాఁ జెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచినదన్నట్లు" మన కులవిరోధి

యగు నాదొంగను దాను బూజించి రాక్షసకులంబునకెల్ల నప్రతిష్ఠఁ దెచ్చినది చాలక తమనుగూడఁ బ్రోత్సహించెను గాఁబోలు !

వ్యాఘ్ర—అవును ! పూర్వము మనవారిధాటి కోర్వఁజాలక పాలసంద్రంబునఁ దాఁగిన నీచుని భజింపవలసినదే !

సుచ—తాను భజించినందుకొనర్చిన మేలునే మనకుఁగూడ సమకూర్చును గాఁబోలును. పేదపాఱుసకేతిని దఱిఁజేరి మూడడుఁగులనేల నిమ్మని యాచించి పుచ్చుకొని పిమ్మట జగమంతయు నాక్రమించి సర్వస్వము హరించి దేవతల కొసంగిన వంచకునేనా ! భజింపవలసినది !

మైరా—కానిమ్ము. వీనికిఁగూడ మత్ప్రతాపం బించుక చవిఁజూపినఁగాని త్రుళ్ళడఁగనేరఁడు.

వ్యాఘ్ర—దేవా ! తమరు నిన్నటిదినంబున కొలువుకూటంబున నున్నయట్టుండి యదృశ్యులౌటకుఁ గతంబేమి ? ఇయ్యది తెలిసికొనఁగోరుచుంటిమి. కాన సాదరభావంబున నయ్యది యెఱిఁగింపఁగోలునేని యానతీయ వేఁడెద.

సుచ—తమ రదృశ్యులౌటకుఁ గతం బరయఁజాలక మేమందఱము తలకొక విధంబుగఁ దలఁచితిమి.

మైరా—అదియా ! చెప్పుమఱచితిని ! వినుఁడు

చ॥ కలఁచుగదా సుహృత్సలిని ♦ కైకసిసందనుఁ డుగ్రవైరి దో
ర్బల పరశోష శక్రముడు ♦ రాక్షసవర్యుఁడు రావణుండు దా
జలమునఁ జోరు శాత్రవుల ♦ సంగరమందున నోర్వలేక యా
యలజడిమాన్పి ప్రోచుటకు ♦ నైతలఁచెన్ ననుఁ జెల్మి పెంపునన్.

సుచ—దేవా ! రావణునకుఁగూడ వెఱపుఁ గలిగించునంతటి వైరి వీఁడెవ్వఁడు !

వ్యాఘ్ర—ఓహో! దానవభోజ్యంబులగు నరవానరాధము లెంత వారలైరి? దానవవీరుల వధించునంతటి పరాక్రమ మెచ్చటి నుండి వచ్చెనో? శౌరా! కాలవైపరీత్యము!

మైరా—కాలవైపరీత్యముకాక మఱేమున్నది. కడచినరాత్రి నేనన్ని విధంబుల నారామలక్ష్మణుల మాయామోహితులం గావించి తెచ్చి మనకాళీకాలయంబున నుంచితి. బలి నొసంగుటకు సర్వము సిద్ధమొనర్పుటకై మన చార్వాకుని నియమించితి. నేనటకుం బోవలయు. నేటికిం గొలువుం జాలింతమా?

వ్యాఘ్ర, సుచ—(ఇద్దఱాశ్చర్యముతో) శబాష్! దానవకులసార్వభౌమా! శబాష్! ప్రతిజ్ఞానిర్వాహణమన్న నట్లుండవలయు. నీప్రతిలంఘన కెవ్వేటివిఘ్నంబు లేల కల్గును?

మైరా—నేటికిం గొలువుం జాలింతమా! (తనలో) అంతఃపురంబున కరిగి దేవితోం గొంతవడి ముచ్చటించి పదంపడి బలివిధానం బాచరించెదంగాక (ఆలోచించి) ఓహో! ప్రమాదమే! దేవిపాటికి దేవాలయంబున కరిగియుండు. అచ్చటి విశేషం బునుజూచిన నామె ఖేదంబునొందు. కావునం బ్రస్తుతమందు బలి విధానంబు విరమించి దేవి దేవతాదర్శన మొనర్చి యరిగిన వెనుక నే నిర్వర్తించెదంగాక. మదీయ మాయామోహితులగు నా నరాధము లెచ్చటికింబోగలరు? (ప్రకాశముగా) వ్యాఘ్రదత్తా!

వ్యాఘ్ర—దేవా! ఏమి సెలవు.

మైరా—శివాలయంబునకరిగి మనచార్వాకునితో దేవిగారాలయంబునకు వచ్చువేళయయినది గనుక బలివిధానంబు ప్రస్తుతంబు నిలుపవలసినదనియు నందులకై సేకరించిన వస్తుచయంబుల నక్కడ నుంచవలదనియు నాయాజ్ఞయైనదని చెప్పుము.

వ్యాఘ్ర—చిత్తము. (అని నిష్క్రమించును)

మైరా—సుచర్త్రికా! నేనిదే యుద్యానవనంబునకుఁజని దేవితోఁ గొంతవడి ముచ్చటించి అచ్చటినుండి దేవాలయంబునకువచ్చెద నీవరుగుము. నేనిదే చనెద.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

చతుర్థరంగము—యుద్యానవనము.

(మదనమాలిని ప్రవేశించును.)

మద—(నిట్టూర్పు విడిచి) ఛీ! దుర్మార్గుఁడగు మగని కట్టుకొని కాపురముచేయుట బహుకష్టము. క్రూరుఁడగు నాజనకుండు నన్నీదానవుని కంటఁగట్టె. జన్మంబున గంధర్వాంగననగు నాకీతని చేష్టితంబులు సరిపడవు.

సీ. ఒకనాఁడు పన్నగ ♦ ప్రకరంబు బాధించు
నురగుల నొకనాఁడు ♦ హింసలఁజేయు
నొకనాఁడు మానుల ♦ వికలాంగులను జేయు
యక్షుల నొకనాఁడు ♦ శిక్షఁజేయు
నొకనాఁడు భుజగుల ♦ సకలంబు హరియించుఁ
జెఱఁబట్టు నొకనాఁడు ♦ స్త్రీల నెల్ల
నొకనాఁడు దివిజుల ♦ గోడించి బంధించు
మనుజుల నొకనాఁడు ♦ మడియఁజేయు

తే॥ గీ॥ సకల! యీరీతి దైత్యుఁడ ♦ హర్నిశంబు
సాధుజనులకుఁ దలఁకగ ♦ బాధఁజేయుఁ
జెప్పిజూతమటన్నను ♦ వినినఁ బోఁడఁడు
పుడమి రోగికి పథ్యంబు ♦ పడనిభంగి.

అయినను పతి సతి కేడుగడయని యెంత సమర్థించుకొంద మన్నను నాఁడుదాననగుటచే, నేయూఁడుదాని యుసురుతగులునో! యేమునీంద్రుఁడు శపించునో! యని నామనంబు తల్ల

డిల్లుచుండును. (కుడిభుజము, కుడికన్నదరుటను సూచించి) ఓహో! ఏమిది? నాకు నేటియుదయంబునుండియు సవ్యభుజనేత్రంబు లదరుచున్నవి. ఇయ్యది యశుభసూచకంబులు గదా? అదియునుగాక, నామనసు నేఁడేమియోగాని జెయ్యవెట్టి కలఁచినట్లున్నది. ఏదియేని కీడు మూఁడదుకద! పుష్పములు దెచ్చుటకై యరిగిన నాచెలు లింతదనుక రాకుండుటకు గతం బేమియో? దేవపూజకు వేళ మించుచున్నదే? ఆహా! యేమి యీచల్లగాలి!

చ॥ కరము మనోహరంబయిన ♦ గాయజుకేళిని డస్సినట్టియా
యుగగవధూజనంబులకు ♦ నూర్జితరీతి సపర్యఁజేసి దె
స్సగిమగు ప్రాణక్షీతివిడి ♦ వారి తనుస్థిత గంధమూని దా
నను సుఖముం బొలంగెడిని ♦ గంధవహుండదె సార్ధనాముఁడై.

ఈచల్లగాలికతంబున నొడలు పరవశత్వంబునొంది నిదురవచ్చుచున్నది. పుష్పంబులు దేనరిగిన నాచెలులు వచ్చుదనుక సిచంద్రకాంతశిలావేదికపై నించుక విశ్రమించెద. (అని నిద్రపోవును.)

[ కుందలతిక ప్రవేశించును. ]

కుంద—సువర్ణకంజంబులు గొనివచ్చుటకై పంపఁబడినమనోరమయింత దనుక రాకుండుటకుఁ గతంబేమి చెపుమా? దానికేదైన మార్గమధ్యంబున నిక్కట్టు సంభవించియుండదుగదా? (ముందుకుఁజూచి) ఏమిది! దేవి! యీ యసమయంబున నిద్రించుచున్నది. (పరికించి చూచి) గాఢనిద్రావశురాలైనట్లు గాన్పించుచున్నదే. (సమీపించి) ఏలాగో! యీదేవి ముఖపద్మంబు వాడియున్నది. కారణంబేమో? కారణంబున కేమున్నది. పాపము, తనప్రియుండొనర్చు కౌటిల్యగాముల నిరంతరంబుఁ దలంచికొని పరితపించుచుండును. కాని యెప్పటికిని యిట్టి

మనస్సు కలయని దాంపత్యంబువలన సుఖంబుండనేరదు. జన్మమున గంధర్వాంగనయగు నీదేవికి రాక్షసకులజుండగు దన ప్రియుండొనరించు దుష్కృత్యంబులెట్లు సరిపడు? అల్లదె! చెలియగు మనోరమవచ్చుచున్నది. (పూలబుట్టతో మనోరమ ప్రవేశించుచున్నది.)

కుంద—మనోరమా! యింతతడవేలఁ జేసితివి? నీకొఱకై చాలసేపచ్చట వేచియుండి యెంతకును నీవురాకున్న విసిగివచ్చితిని.

మనో—మంచిపనిచేసితివి. నీకొఱకై నేనచ్చట వెదకి విసిగి యచ్చట నుండవని తలంచివచ్చితిని.

కుంద—ఇంతకు పుష్పములేమైనఁ గోసితివా?

మనో—పుష్పములకొఱకు నేజనలేదు. మార్గమధ్యమునఁ గొన్ని పుష్పంబులనువిని దానినీకెఱిఁగింపవచ్చితిని.

కుంద—సరే! బాగుగనే యున్నది. దేవికి పూజాసమయ మైనది. పుష్పములఁ గోసికాకున్న దేవి కోపగించునని యైన భయంబుఁ గూడ లేక వట్టిచేతులతోఁ దిరిగివచ్చితివా? నీకు మొదట నుండియు నిట్టి మాంద్యమేకదా?

మనో—నేనంత వెఱ్ఱిదాననా? ఏదియొక గొప్పవిశేషము గనుండిన నేనుమాత్రము దేవియాజ్ఞ మీఱుదునా?

కుంద—ఏమిటంత విశేషము? చెప్పుము.

మనో—(కుందలతిక చెవిలోఁ జెప్పును.)

కుంద—అయ్యో! నిజమేనా? అట్లున్నటికిని జరుగనేరదు. వారిదానవాథముని చేతులలోఁ జావరు. రావణవధార్థము జన్మించిన భగవంతుండగు రామచంద్రుం డాకార్యము ముగింపకమున్నె దనుజునిచే మరణ మొందునా? ఇది నీకెవ్వరు చెప్పిరి?

మనో—దారిలో మన మందకర్ణుఁ డెదురుపడి చెప్పెను.

కుంద—సరి ! సరి ! మన మందకర్ణుని మాటలా ? అయితే నమ్మదగి నవే. అందుకనే యింత యాలస్యమైనది. మందకర్ణుని కుమ్మ ప్రియములకేనా నీవింత యాతురతతోఁ జెప్పవచ్చితివి ?

మనో—కాదమ్మా ! నేఁజెప్పిన మాటలయం దబద్ధము లేదమ్మా ! నేను స్వయముగాఁ జూచివచ్చినాను.

కుంద—నీవు స్వయముగాఁ జూచినావా ?

మనో—నేను స్వయముగాఁ జూచి వచ్చినాను. బలికై ప్రయత్న మొనర్పఁబడుచున్నది.

కుంద—నీ వెన్ని చెప్పినను వారుమాత్రము వినిపోఁ జావరు. యేదేని యంతరాయము కలిగితీరును. దాన నిలంకకుఁ దప్పక కీడు వాటిల్లు. ఇది నిశ్చయము.

మనో—అగుఁగాని యీసంగతి దేవి కెఱింగించిన,

కుంద—వద్దు. వద్దు. ప్రాణేశ్వరుని సుందగముల కేవఱకే ఖిన్నయగు దేవికీసంగతి దెలిసిన మఱింత సంతాపకారణం బగు.

మనో—మనము చెప్పకున్న దేవికి తెలియకుండునా ? ఆపెకీదానవుని చెర్యుంబులు పరిపాటియైనవి. చెప్పెదను.

కుంద—సరే ! నీయిష్టము. (మదనమాలిని వైపునకుఁ దిరిగి) దేవి నేఁడీసమయంబున నింత గాఢనిద్రాపరవశురాలవగుటకుఁ గార ణం బేమొ ? దేవిపూజకు వేళ మించుచున్నదే !

మద—(నిద్రలో) అయ్యో ! అయ్యో ! (అని కలువరించును.)

కుంద—మనోరమా ! దేవి కలువరించుచున్నదే !

మద—(నిద్రలో) అయ్యో ! కుందలతికా ! నేనిఁక జీవింపనే ! నేనును నా ప్రాణేశ్వరు ననుసరింతునే !

కుంద—ఇదేమి ! దేవినోట నెన్నఁడును వెడలని యశ్లీలంబులు వచు

పీయిష్టదైవమగు శాంకరి సన్నుఁగాపాడుచుండ నీకెట్టి కొఱంత
లేల కలుగునమ్మా!

మద—అయ్యో! ఈ పాడునిద్రచే దేవిపూజకు వేళయతిక్రమించెను
గదా! ఓసీ! కుందలతికా! పూజకు సర్వము సిద్ధముఁజేసితివకే?

కుంద—అమ్మా! అంతయు నిదివఱకే సిద్ధముఁ గావింపఁబడినది.

మద—ఓసీ! మనోరమా! నీవేగి పూజాద్రవ్యంబులు సిద్ధపఱచి దేవి
నలంకరింపుమని మనచార్యులనితో నాయాజ్ఞయైనదని చెప్పుము.

మనో—చిత్తము (అని నిష్క్రమించును)

మద—కుందలతికా! ఈస్వప్నంబు గాంచినది మొదలు నామనంబు
కలఁతఁ జెందుచున్నదే? ప్రాణేశునకేయపాయము వాటిల్లదు
గదా! అన్నిటికిని మనకేదుగడయైన శాంకరీదేవియే గలదు.

(చేతులుజోడించి కన్నులుమూసికొని దేవినుద్దేశించి)

శా॥ ఓకాత్యాయిని సర్వలోకజననీ! ♦ యుష్మత్పదాంభోజచిం
తాకన్యస్త మనంబునన్ సతిమునిన్ ♦ ధ్యానించుచుందున్ గదే!
కారుణ్యముఁజూపి నేఁడు నిదురన్ ♦ నేఁగన్న స్వప్నంబుచే
నాకేయొగ్గులుఁ జెందకుండఁగను ని ♦ న్నానంబుతోఁ బ్రోవుమీ.

హే జగజ్జననీ! లోకమాతా! చిన్నటనుండియు నిన్నే ధ్యా
నించుచుందు నన్నుఁగాచుభారము నీదే. నేఁడు నేఁగాంచిన
దుస్స్వప్నంబువలన నాకునునా ప్రాణేశునకును నేమియుఁగీడు కలుగ
కుండ రక్షించుభారము నీయందేకలదు.

మనో—(తొందరగా ప్రవేశించి) అమ్మా! అమ్మా!

మద—(కన్నులు తెఱచి) ఏమే? ఏమి సంభవించినది?

మనో—(సిగ్గుపడి) ఏమీలేదు.

మద—ఏమీలేదనెదవేల? ఏదియో చెప్పఁబోఁడగితివిగదా? యూరక
కుందెదవేల?

విలువలేనట్టి జిలుగు దు ♦ వ్వలువతోడ!
నింతి గనుపట్టు మరుని చో ♦ దంతియనఁగ!
ఈ సుందరి యిప్పుడే స్నానమొనరించెను గాఁబోలు!

తే॥ గీ॥ స్నానమొనరించెఁ గాబోలు ♦ సకియమిన్న
వెడదవే నలిఁ జాతిచి ♦ వింతఁగొల్పు
జారుముడివైచె సదిగో యీ ♦ సరణిఁజూడ
పూజకాయత్తమైనట్టి ♦ పొలుపుతోఁచు.

కాని యీసుందరి నేఁడేలొకో విచారాక్రాంతచేతస్కయైనట్టు కాన్పించెడిని.

తే॥ వాడుఁబారినగతిఁ దోచు ♦ వనిత మొగము
వేడి నిట్టూర్పుగాడ్పులు ♦ వెడలఁ దొడఁగె
వింతరీతినిగన్పట్టె ♦ జింతఁ గదుర
గారణంబది యేమొకో ♦ కాన రాదు.

మద—(ఎదురుగావచ్చినమస్కరించి) నాథా! ఈయాసనమధిష్ఠింపుఁడు.

మైరా—(ప్రకాశముగ) సుందరీ! నీవదనారవిందం బేలొకో! విన్నఁబోయినది. కారణంబు సత్వరంబ దెల్పుము.

మ॥ సురవిద్యాధర నాగకామినులలోఁ ♦ జూడంగ నీయాన దా
శిరమందుఁ ధరియించి చేయనిసతిన్ ♦ శీఘ్రంబుగాఁ దెల్పు నే
కరుణాలేశములేక యాసతిని వే ♦ ఖండించి శీర్షంబు నీ
చరణద్వంద్వము చెంతఁ జేర్తు తరుణీ ♦ సానందవై చూడుమీ.

మద—[తనలో] అందుకు సందియమేమి? స్త్రీజనంబుల వధియించుటయం దప్రతిహతప్రతాపులమే గదా!

మైరా—దేవీ! నీడెందంబునన్ గల దుంగునకు కారణం బెఱిగింపవుగదా?

తే॥ గీ॥ ఏటికీరీతి వెతనొంద ♦ నింతిమిన్న
మూఁడులోకంబులందున ♦ ముదిత నీకు

వలయుదానిని వేడుము ♦ వారకిపుడు
గొంచువచ్చెద నీదగు ♦ గోర్కె దీర్ప.

ఈమూఁడు లోకంబులయందేగాదీపదునాల్గు లోకంబులయం
దైనను నీవెద్ది గోరిన దానిఁ గాదనక సంఘటింప నీదాసుం
డిదె సంసిద్ధుఁడై యుండ నీవిట్లు కించనొందనేల! వైళంబ
దెల్పుము.

మద—(శిరము వంచి యూరకుండును.)

మైరా—(తనలో)ఏమిది నేనెన్నివిధంబుల బ్రతిమాలినను దన సంతాప
కారణంబెఱిఁగింపకున్నది., ఈకుందలతిక నడిగిచూచెద. (ప్రకాశ
ముగా) కుందలతికా! మీచెలి విచారహేతు వెయ్యదియో
నీవైన నెఱిఁగింపఁగలవా?

కుంద—చిత్తము. మహారాజా! మఱేమియును లేదు. ఇంతకుఁ
బూర్వమే దేవి యొకదుస్వప్నముఁ గాంచినది. దానిఫలితంబు
తమకుఁ గీడును సూచించుచున్నదఁట. అదియే దేవికి విచార
కారణము.

మైరా—(నవ్వుచు) ఇదియా! సరే! బాగున్నది. దేవీ! నీకీ వెఱ్ఱి
మానదుగదా? (వీఁపుపైఁ జెయ్యివైచి) కలలందేటి నమ్మ
కము? మనమనంబుల ననుసరించియే గలలు వచ్చుచుండును.
స్వప్న శుభాశుభంబుల నిజమని నమ్మినవారలు డప్పిఁగొనినవా
రెండమావుల నీరని భ్రమించి తిరుగు వెఱ్ఱివారిరీతి పరిహాసా
స్పదులగుదురు. కాన నీమనంబునఁగల విచారంబుఁదక్కుము.

మ॥ బలిమిన్ సర్వదిగీశులన్ గెలిచి ద ♦ ర్పంబొప్పఁ గప్పంబు లిం
పలరన్ గొంచుఁజరించువాఁడ నిఁక నీ ♦ వార్తిన్ విచారింపఁగా
వలెనే? స్వప్నశుభాశుభంబులను మ ♦ ద్బాహాశిమాయించెడిన్
వలవంతన్ దపియించుటింక విడుమీ ♦ భావంబునన్ సుందరీ.

అదియునుగాక సర్వలోక భయంకరంబగు తపంబొనర్చి విరించిని మెప్పించి సంగరంబున శస్త్రాస్త్రంబులం జావులేకుండ వరంబులు వడసిన నన్నీ స్వప్నదోషంబు లేమిసేయు ?

మద—నాథా ! దీనికేమిగాని నాకు మీయెడగల చనువుబలిమిని నొక్కటడిగెద. సాదరభావంబునం జెప్పవేఁడెద.

మైరా—దేవీ ! నీసేవకు నింత బ్రతిమాలవలెనా !

మద—మీరీదినంబున గాళికకు బలియిచ్చుటకునై యిద్దఱు మనుజులను దెచ్చితిరఁట నిజమేనా ?

మైరా—(తనలో) ఓహో ! ప్రమాదమే. ఈసంగతీమె కెట్లు తెలిసినదో ? (ప్రకాశముగా) అగుఁగాక. అయిననేమి ?

మద—అక్కటా ! ఇది యెట్టిపని. అయ్యో ! ముజ్జగంబుల గెలిచి, జగంబులయం దెందును బ్రతివీరుఁగానక చరించు వీరాతివీరులైన మీరీరీతి వైరులమాయామోహితులఁ గావించి కూల్చుటేటి ధర్మము. శూరులగువారు యుద్ధములయందు శత్రువుల నెదుర్కొని కూల్తురేగాని మీవలె నీరీతి నిద్రఁజొక్కినవారిని వధియింతురా ? అదియునుంగాక.

చ. అరయఁగఁ బ్రాణిసంతతుల ♦ కన్నిటికిన్ మనువాంఛ యొక్కటే !
వెరవుననైన బ్రాణముల ♦ వీడకయుండుట కెంచునేకదా !
యొరులను హింససేయుటది ♦ యొప్పునె ? బాధసమంబ కాదె ! ము
ష్కరమగుకార్యమేటికిఁక ♦ జాలును మానుము రాక్షసేశ్వరా!!

మఱియు—

ఉ॥ అక్కట ! వన్నెవాసిగల ♦ యట్టికులంబున జన్మమందితీ
వెక్కుడు బాహుశక్తి జగ ♦ మెల్లడఁ బేరువహించి కీర్తిపెం
పెక్క రసాతలంబిటుల ♦ నేలెడి ధర్మవిదుండవిట్టి నీ
వక్కజమైన కానిపని ♦ కారయఁబూనుట పాడియౌనొకో !

ఇదియునుగాక నేనొక్కదుస్స్వప్నంబుఁగంటి దానిఫలమంతశుభావహమ్ముగ లేదు. స్వప్నంబు లొకానొకప్పుడు భావిఫలసూచకంబులని పెద్దలు చెప్పుచుందురు. స్వప్నంబున మనకశుభంబు గలిగినంతమాత్రమున సీదాసనగు నేనింత వందురుచుండ నిక్కువంబైన భర్తృమరణవార్త విన్నవారెంత దురపిల్లుదురో! దానినైన మీమనంబున నూహించి యీదురుద్యమంబు మానుఁడు. ఇదియిట్లుండ మున్నొకప్పుడు మజ్జనకుని గృహంబున నేనుండ నారదమహర్షి యచ్చటికరుదెంచి ప్రసంగవశంబున మజ్జనకునితో భగవంతుఁడగు నాదినారాయణుఁడు భూమియందు మనుజుండై సూర్యవంశంబున దశరథరాజనందనుండై రాముండనుపేర జన్మించెననియు రావణాద్యఖిల రాక్షసుల సంహరించుననియు వినియుంటి. ఆరాముఁడే యితఁడు. మీరనుకొనినట్లంత సులభంబుగ మీచేఁజావఁడు. తప్పక యేదియేని యంతరాయము ఘటస్థించు; దాన మనలంకకు ముప్పువాటిల్లు. ఇదియును గాకిదివఱకు వారికిని మనకును నెట్టివైరంబును లేదు. కుడిచికూర్చుండి యేల యిట్టి యకారణవైరముఁ దెచ్చిపెట్టుకొనవలె! కావుననావిన్నపమాలించి యిప్పటికీయుద్యమంబు మాని వారిని యథాస్థానంబును జేర్పుఁడు.

మైరా—ఓసీ! జేలా! పలయీరీతి నాకు పిఱికిమందుఁ బోసెదవు. నీవొనర్చిన హితోపదేశమంతకును నేను ప్రత్యుత్తరంబొసంగెద వినుము. శూరులకుఁగూడ శత్రుని మాయోపాయంబున వధింపవలసివచ్చు. ఇందుకు మీదేవతలె తార్కాణము. అందును మీరెల్లప్పుడు భగవంతుఁడని బూజించు నావిష్ణుఁడే యెట్లనిన.

సీ॥ సూకరరూపంబు ♦ జేకొని మాహిర
ణ్యాక్షుని గ్రసుంపఁడే ♦ న్యాయమనక

మూఁడడుగులభూమి ♦ వేఁడుచు బలిఁజేరి
రాజ్యంబుఁగొనఁడె ధ ♦ ర్మంబువీడి
బృందపాతివ్రత్య ♦ పూజ్యతఁ జెఱిచి జ
లంధరుఁ జంపఁడే ♦ లజ్జలేక
మునిసతియనినైన ♦ మనమునఁ దలఁపక
భృగుపత్ని దునుమఁడే ♦ భీతివిడిచి
తే॥ గీ॥ అతని వ్యాపారలెల్లరు ♦ సతతముభక్తి
దైవమంచని మనములఁ ♦ దలఁపరొక్కొ!
యసురు లన్యాయవర్తను ♦ లనుటకాని,
కానిపనులన్ని జేసెడి ♦ ఘనులె సురలు.

ఇఁక శూరుఁడగువానికిఁ గరుణ యెట్లు చొప్పడు! రణమున శత్రుమారణ మొనర్చునప్పుడు కరుణ యనునదికల్గిన విజయ మెట్లు చేకూరు! అబలవగుటచే నింటఁ గూర్చుండుదానవు గాన నీకెఱుకపడదు. కాని రణంబున మరణాపన్నులగువారి బాధలఁ జూచునెడ జాలిపొడమిన ముందున కొక్కయడుగైన నిడ శక్యమే? ఇఁక నస్మిమనుజుఁడు భగవంతుండని నీవు బెదరించిన పల్కులెన్న సీతఁడు భగవంతుఁడేయైన నేనొనర్చు మాయకు వశుండగు టెట్లు? అదియునుగాదు. పోనిమ్ము. ఒకవేళ సీతండు నీవనినట్లు భగవంతుఁడే యగుఁగాక.

క. దేవుఁడెయగుఁగా కాతఁడు
జావక మఱి యేలతప్పుఁ ♦ జయ్యన నాచేఁ
గావఁగ శక్యముకాదిఁక
భావజవైరికినినైన ♦ బద్మదళాక్షీ!

ఈనరుండు నిరపరాధుం డని యంటివా? అదియును గాదు, వీఁడు పరమనీచుఁడు. ఏమన,

సీ. స్త్రీయని దలఁపక ♦ చేరి శూర్పణఖను
ముక్కుఁగోసినయట్టి ♦ మూర్ఖుఁ డితఁడు

చెట్టుమాటున డాఁగి ♦ నెట్టన వాలిని
నేలఁ గూల్చినయట్టి ♦ నీచుఁడితఁడు
వాలి సతీమణిఁ ♦ వాని సోదరునకు
భార్యగాఁజేసిన ♦ పాపియితఁడు
ఆబాలవృద్ధంబు ♦ హా! యని ఘోషిల్ల
లంకఁగాల్పించు ని ♦ ర్లజ్జుఁడితఁడు

తే॥ గీ॥ ఉపద యేమనుకొంటివో ♦ యుల్లమందు
పాపపుంజంబులకు నాట ♦ పట్టువీఁడు
వీని వధియింపకున్నను ♦ వెలఁదిముందు
మా కులంబంతయును వేరు ♦ మాఁపుఁజుమ్ము.

వీనినిప్పుడు వధియింపకున్న ముందుముందేమునియో యేపాడు దేవతలో తిమ్ము బాధించుచుంటివని జెప్పిరేని మనలంకమీదికిఁగూడ దాడివెడలును. అప్పుడు గోళ్ళతోఁ జీఁకెదుపనికి గొడ్డళ్ళతోఁ జిమ్మవలసివచ్చు. కాన మా కులంబునకంతయు వేరుపురుగయిన నీమానవాధముని వధియించి నిశ్చింతనుండెద. నీవు విచారంబుఁదక్కి యంతఃపురంబునకరుగుము.

మద—అయ్యో! నాథా! నేజెప్పిన దోకించుక యైనను జెవినిడరు కదా? మీకేర్పడిన ముప్పువాటిల్లిన నాగతి యేమికావలయు. నాపలుకాలకింపుఁడు. మీకిదే మ్రొక్కెద. (అని నమస్కరించును.)

చ॥ కరములుమోడ్చివేఁడెద న ♦ కారణమింతచలంబు మానుమీ
నరులని నీమనంబునను ♦ నాథ! తలంపకుమయ్య వీరి నా
సరసిజనేత్రుఁడీ కరణి ♦ సంభవమందెను రాముఁడై ధరన్
మరణములేదు నీవలన ♦ మానుము వైరము దానవాగ్రణీ!

మీవలన వారు చావరు పైపెచ్చు యేదేని ముప్పువాటిల్లు.

మైరా—(కోపముతో) ఓసీ! యేటికీరీతి వ్యర్థప్రసంగంబులు గావించెదవు. నాకేలకీడువాటిల్లును నీవెంతచెప్పినను నేను వీరివిడువను.

ఉ॥ భావమునందు భీతివిడు ♦ భగ్నుఁడుఁగాచిన నేటిరేయి నే
నేవిధినైన రాఘవుల ♦ నిత్తు నిఁకన్ బలి కాళికంచు నా
రావణుముందటన్ బలికి ♦ రాక్షసులెల్లరు నవ్వ వీరినే
లావుఁదొఱంగి వీడినను ♦ లాఘవమౌఁగద ! శూరకోటిలోన్.

కావున వీరినేవిడువ.

మద—అయ్యో! "తనకుమాలిన ధర్మము మొదలుచెడ్డ బేరము" నుండ దన్నట్లు యెవరిబాగోగులు వారివిగాని యితరులకేల ? ఆరావణుఁడు వారితో వైరముపెట్టుకొని తానుచెడినదిగాక మనలనుగూడఁ జెరుపనెంచెను గాఁబోలును. రావణునిముందట నాడినంతమాత్రమున మనకేమియెగ్గు ? కావున నామాటలు మన్నించి వీరిని విడువుఁడు.

మైరా—(మహాకోపముతో) ఆ ! ఏమీ ? శూరులగువారికీర్తి నాడి తప్పుటకన్న నీచమున్నదే ? ఏల యీనీతి నోటికివచ్చినట్లెల్లఁ బ్రేలెదవు ?

ఉ॥ ఓసిదురాత్మురాల ! యిటు ♦ లోడక నోటికివచ్చినట్లుగా
దోసములాడ సాగితివి ♦ తుచ్ఛనిమానవుఁ బెద్దఁ జేసినా
వాసిఁదొఱంగిపోవఁగను ♦ వారికయీగతి నాడుచుండినన్
గోసెద నీదునాలుకను ♦ గోమలివంచుఁదలంప నివ్వేళన్.

నాకేమో కీడువాటిల్లునని యొకమానవాధము నేమోపెద్దఁగావించి యేమేమో కాఱులు కూయసాగితివి. అవును నీకింత చనవొసంగుట నాదేలోపము. ఆఁడుదానవగు నీకేలయీప్రసంగము. ఇఁక నీవిషయంబును గురించిమాటలాడిన నిన్నుమన్నింపను. నేనిదే పోవుచుంటిని. నీవరుగుము.

(అని నిష్క్రమించును.)

(మదనమాలిని నివ్వెరపడి చూచుచుండును.)

కుంద—అమ్మా! యీయనమన స్సెరింగియుండియు నేలయింతదూరము చెప్పితిరమ్మా !

మద—(నిట్టూర్పువిడచి) నిజము! కుందలతికా! నిజము.

తే॥ గీ॥ కరుణయనుమాట యెఱుఁగని ♦ కఠినుఁడనుచు
మనముజెప్పెడి మంచిని ♦ వినఁడటంచు
మొదటినుండియు నెఱిఁగినే ♦ మోసపోతి
చేలనైతిని నాబుద్ధి ♦ కాలిపోను.

అకటా! ఎట్టి బెట్టిదంపుపల్లుఁ బల్కెనో? నేనాడిన దుర్భాషలకు నానాలుకఁ గోయునట. ఔరా! ఏమి! మూర్ఖత్వము. కాని! కానున్నది కాకమానదు.

మనో—ఆలయంబున కరుగుదమా?

మద—వలదు వలదు. నేఁ డచ్చటికినిఁ బోవలదు. అచ్చట జరుగఁ బోవు ఘోరమును మనము చూడఁజాలము. ఉదకంబులఁ దెమ్ము. శుచినై యిచ్చటనే దేవిని ధ్యానించి మనసౌధంబున కరుగుదము.

మనో—(నిష్క్రమించి పాత్రతో మరలఁ బ్రవేశించి పాత్రనందిచ్చును.)

మద—(కాళ్లు చేతులు తుడిచికొని కనులు మూసికొని చేతులు జోడించి)

శా॥ ఓసర్వేశ్వరురాణి! విశ్వసృజనీ! ♦ యోపాపవిధ్వంసినీ!
యోసర్వామరపూజితాంఘ్రికమలా! ♦ యోభక్తసంపూజితా!
యోసర్వాయుధశోభితాంచితకరా! ♦ యోరాజరాజేశ్వరీ!
నీసేవాలసనై మెలంగెడి నను ♦ నిత్యంబు రక్షింపుమా.

మఱియు నోజగన్మాతా!

ఉ. నీకరుణావిశేషమది ♦ నెక్కొనెనేని జగంబులందుఁ దా
నేకలుషాత్ముఁడైనను స ♦ రే గుణవంతుఁడు కాకపోవునే?
నీకరుణావిలోకనము ♦ నిల్పి మదీయవిభుఁ గుణాఢ్యుఁగా
వీఁకఁదలిర్పఁజేయఁగను ♦ వేఁడెదనమ్మ జగత్కుటుంబినీ!

హేజననీ! యనుదినంబును నిన్నతిభక్తిఁ బూజసేయు నన్నను గ్రహించి పూర్వభవార్జిత పాపసంచయంబున కనుగుణంబుగ లభించిన మత్ప్రాణేశ్వరుని దుష్టకృత్యంబులనుండి విముఖునిగాఁ జేయ నిన్నిదే ప్రార్థించెద, (కన్నులుదెఱచును.)

కుంద—అమ్మా! సౌధంబున కరుగుదుమా?

మద—పోదము పద. (అందరు నిష్క్రమింతురు. తెఱపడును.)

చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీఆంజనేయార్పణమస్తు.





శ్రీ

శ్రీకాకుళరమణసహాయం.

శ్రీ ఆంజనేయస్వామినేనమః.

# మారుతి విజయము.

## —♦ పంచమాంకము ♦—

### ప్రథమరంగము—పాతాళలోకము

[ ఆంజనేయుని ప్రవేశము ]

ఆంజ—ఆహా! ఏమీ! ఈదానవుని పురరామణీయకము. రావణుని పురంబుకన్న వేయిమడుంగులు వైభవంబుచే నలరారుచున్నది. ఇంతవర కెచ్చటను రాక్షసుల వత్తిడి కలుగలేదు. అల్లదే! దానవుని నగరద్వారము. అచ్చట రాక్షసవీరులు గాపుండినట్టు కాన్పించుచున్నది. కానిమ్ము. "రోట దలనుంచి రోకటిపోటునకు వెఱచువెట్టి" రీతి నీదానవులకే భీతిల్లిన ముందు జరుగవలసినదంతయు నెట్టులగు? (పరిక్రమించి) ఆహా! ఈదానవులు మద్యపానమత్తులై దేహంబులు మఱచి యెట్లు గంతులు వైచుచున్నారో!

సీ. సురలోనఁ దనరూపుఁ ♦ జూచి మీసలుదువ్వి
తలయూఁచి తనుమెచ్చు ♦ దనుజుఁ డొకఁడు
నీడనుజూచి యి ♦ ట్లాడుమా యనిపల్కి
యాడెడు నల్లదే! ♦ యసురుఁ డొకఁడు
పెఱవాని వీఁపుపైఁ ♦ జఱచుచు నెలుగెత్తి
పాడుచుండెడు సుర ♦ వైరియొకఁడు

సురపాత్రఁగొని త్రాఁగఁ ♦ జూచి పైకొని, కొంచు
పఱుగువాఱెడు రాత్రి ♦ చరుఁడొకండు
తే॥ గీ॥ చాల వెడమాటలాడు పి ♦ శాచియొకఁడు
లావుదఱుఁగ నిలఁబడు ప ♦ లాశియొకఁడు
ఔర ! కాదంబరీపాన ♦ హర్షమునను
దనువు లెఱుఁగనిగతిఁ దోఁచు ♦ దనుజు లరిగొ !!

ఇట్లు మదిరాపాన విహ్వాలమానసులగు వీరిని వధియించుటెంత పని! ఇంతకును రామచంద్రుని కేమియుకీడు వాటిల్లకుండినగద? నేనుండగ రామచంద్రున కెట్టు కీడువాటిల్లును? వాటిల్లకుండఁ జేయునదేమి? ఈదానవునివీట రామచంద్రుని జాడ నరయుట దుస్తరముగదా? అడుగడుగునకును రక్కసులతోఁ బోగు నేనెట్లు రామచంద్రుజాడ నరయఁగలను? అదిగో! ఎవ్వరో వచ్చుచున్నారు. (పరికించి చూచి) స్త్రీవ్యక్తివలె నున్నది. ఈమెనడిగిన రామచంద్రునిజాడఁ జెప్పునేమో? మఱి! ఈమె కూడ రాక్షసాంగనయై యుండనోపు. అట్టియెడ రామచంద్రునిజాడ నెఱిఁగించునా? కానిమ్ము. అడిగిచూచెద.
(దోర్దండి బిందెపుచ్చుకొని ప్రవేశించును.)

దోర్దం—(ఆంజనేయుని జూడక యె) అయ్యో! రామచంద్రా! నీవి మాయదారి రక్కసునిచేత నెట్లుచిక్కితివి తండ్రీ! నినుఁగన్న సీతలిదండ్రు లెంత దుఃఖావుచుండిరో కదా! ఈ కఠినాత్ముని కెన్నటికినిచావు లేకున్నది. నాభర్తనుజంపించి నాకొమరునిబందిగా నొనరించిన నీ కఠినాత్మునకు సోదరుఁడైననేమి? మఱొకఁడైన నేమి? వీనిదుండగముల కంతములేకున్నదికదా?

ఆంజ—(తనలో) ఏమిది! ఈమె రామచంద్రుని స్మరించుచున్నది. ఈమె పైకిఁజూడ రాక్షసాంగనవలె నున్నది. ఈదానవుని వీటనుకూడ రామనామము స్మరించువారలు గలరని తోఁచు

చున్నది. ఈమెనడిగిన రామచంద్రుని యుదంతమేమైన దెల్పునేమో? అడిగి చూచెదఁగాక (ప్రకాశముగా) అమ్మా!

దోర్దం—(వెనుకకుఁ దిరిగిచూచి) ఎవరు నాయనానీవు? నీవీచోటికిఁ గ్రొత్తవానివలెనున్నావు. ఇది మహాపాతకుండైన మైరావణుని పట్టణము. ఈపట్టణంబుఁజొర దేవతలకైన నశక్యము. దీనఁ బ్రవేశించుట కాలునిప్రోలుఁ జేరుటయేగాన సత్వరంబ యిచ్చటి నుండిపొమ్ము! అల్లదే! దీనజనమందారుండగు బలిచక్రవర్తి పురము. అల్లదే! నాగకుమారులుండుచోటు. వీనిలో నీయిచ్చవచ్చినచోటికరుగుము.

ఆంజ—(తనలో) ఈమె చాల యోగ్యురాలుగాఁ గనుపించుచున్నది. (ప్రకాశముగా) సరే! అట్లే పోయెదనుగాని తల్లీ! నీవివ్వడు రామచంద్రాయంటివే? ఆరామచంద్రుఁడెవరు? కొంచెముజెప్ప గలవా?

దోర్దం—(నిట్టూర్పువిడిచి) నాయనా! ఆమందభాగ్యుండొకనరుండు. ఈమాయలమారి రక్కసుండు మాఁయచే మోహితునిగావించి తమ్మునితోఁ గూడ కాళికకు బలియిచ్చుటకై తెచ్చెను.

ఆంజ—(ఆత్రముతో) బలియిచ్చెనా?

దోర్దం—లేదునాయనా లేదు. అందుకై ప్రయత్నము లొనర్పఁబడు చున్నవి. నన్నిదే యభిషేకమొనర్చుటకై భోగవతీజలంబులు దెచ్చుటకు నియమించెను.

ఆంజ—(తనలో)ఇప్పటికి రామచంద్రుఁడు సజీవుఁడై యున్నట్టు తెలియ వచ్చినది.(ప్రకాశముగా) అమ్మా! నన్నచ్చటికిఁ గొనిపోఁగలవా!

దోర్దం—అమ్మయ్యో! అదిమాత్రము సాధ్యము కాదు. అల్లదె? ఆకనుపడునదే దానవుని సింహద్వారము. దానియొద్ద ననేక కోట్ల రక్కసులు కాపుందురు. దానిఁగడచి దేవాలయుంబు చెంతకరిగిన నచ్చట తొంబదికోట్ల రక్కసులు గాపుందురు.

వారల జయించినఁగాని యాలయంబుఁ జొరలేము. ఇట్లు రాక్షసజనాకీర్ణంబగు నిప్పురంబున నిన్నుఁ గొనిపోవుటెట్లు?

ఆంజ—నేను సూక్ష్మరూపినై నీజలకలశంబున డాఁగి యుండెద. ఎట్లైనఁ గొనిపొమ్ము.

దౌర్గం—అదిమాత్ర మెట్లు సరిపడు. నీవెంత సూక్ష్మరూపివై యున్నను రాక్షసులఁ గన్నుఁ బ్రాముట దుస్తరము. ఏమాత్రమైన రక్కసులు పొడకట్టినచోఁ బ్రమాదముకాదా?

ఆంజ—భయములేదు. వలసినచో వారలతో యుద్ధమొనర్చియైన నిన్ను రక్షించెద.

దౌర్గం—ఏమీ! ఇంతమంది రాక్షసవీరులతో నీవొక్కఁడవు పోరఁ గలవా? అదియునుగాక నీవెవ్వఁడవు? నీకారాముని సంగ తెందులకో ముందెఱిఁగించిన నిన్నుఁ గొనిపోవు విషయ మాలోచించెద.

ఆంజ—(తనలో) ఈమె చాలగడుసరిగాఁ గాన్పించుచున్నది. ముందు నన్నెఱిగింపఁ గోరుచున్నది. కానిమ్ము. నాకేమి భయము. చెప్పెదఁగాక. (ప్రకాశముగా) పడతీ! నాయుదంతం బెఱుఁగఁ గోరితివిగాన వినుము.

మ॥ హనుమన్నాముఁడ! మారుతాత్మజుఁడ! నే ♦ నారామభక్తుండ! నీ
దనుజుండుద్ధతి మాయఁజేసి యిటకున్ ♦ ధాత్రీశులన్ దెచ్చెనా
విని యేతెంచితి వీరిగావ పటుమ ♦ ద్వీర్యాతిరేకంబునన్
మనుజాశిన్ దెగటార్చివైతుఁ గనుఁగొ♦మ్మా! నాదుశౌర్యంబిఁకన్

దౌర్గం—మహాత్మా! ధన్యురాలనైతి. నాకష్టంబులీడేరె. నారదమహా సీంద్రులు వచించినరీతి మిమ్ముఁ గనుఁగొంటి, ఇఁక మిమ్ముఁగొని పోయెద. నీభుజబలంబు ప్రాపున నీరక్కసిమూఁకనిఁక లెక్క సేయను.

ఆంజ—నారదమౌని యేమనిజెప్పెను? నీకష్టంబులెవ్వి?

దౌర్దం—మహానుభావా? నేనీమైరావణుని సోదరిని. ఈదురాత్ముఁడు నిరంతర హరిపదసేవాపరాయణుండగు మత్పతిఁ జంపి నా ముద్దుల పట్టిని కారాగృహంబున నునిచి నన్నీవిధి దాస్యంబునకు నియమించె.

ఆంజ—నీపతి విష్ణుభక్తుఁడా? ఆతఁడుమాత్రము రాక్షసకులజుఁడు కాఁడా? అట్లయిన నతనికా ప్రపత్తి యెట్లుకలిగె?

దౌర్దం—స్వామీ! అతఁడు రాక్షసకులజుండైనను భక్తాగ్రేసరుండైన బలికత్యంత ప్రియమిత్రుఁడగుటచే నాతనికట్టి సుగుణసంపత్తి కలిగె. కలిగిన నేమిలాభము?

ఆంజ—అటులనా? సరే! పిమ్మట.

దౌర్దం—ఇట్లీ నిరంతరసేవకావృత్తిచేఁ దపించుచుండ నొక్కనాఁడు నారదమహామునీంద్రుని దర్శనములభించె. అంత నేనామహాత్ముని కాళ్ళపైఁబడి నాకష్టంబులెప్పటికిఁదేరునని వేఁడ నాతఁడు నా యందు గరుణించి హనుమంతుండను వానరవీరుండేతెంచునని, వానిచే నీదుష్టుండు సపరివారంబుగా నీల్గునని, దాన నీకష్టంబు లీడేరునని వాక్రుచ్చె. కాన నామహాత్ముని వచనానుసారంబుగ నిన్నుఁ బొడఁగంటి. నాకష్టంబులీడేరె. ఇఁక నేనీ రక్కసిమూకకుఁ వెఱవ. మిమ్ముఁదోడ్కొనిపోయెద నావెనువెంటరండు.

ఆంజ—వలదు. వలదు. నేనీరూపంబున నీవెనువెంటవచ్చిన నీరక్కసు లూరకుండరు. వీరితోఁ బోరుచుండ నేనారామచంద్రుని గనుఁ గొనుట కాలస్యముకాఁగలదు. ముందు రామచంద్రునిఁ జూచి యాతని సురక్షితుఁ జేసి పదఁపడిఁగాని విజృంభింపఁ గూడదు. గాన సాధ్యమగునంతవర కీరక్కసుల కంటఁబడకుండ ముందు రామచంద్రుఁడున్న యెడకుఁ జేరవలయు. నేనిదే సూక్ష్మరూపంబు గైకొనియెద. నీజలకలశంబున నిడుకొనిపొమ్ము.

దౌర్దం—చిత్తమట్లేకానిండు,

ఆంజ—సరే! పద!

ఉ॥ వీనులవిందుగా నిటుల ♦ వింటిని రాఘవు సేమమింక నీ
దానవు వీడు సొచ్చియట ♦ దాశరథిన్ గని ముందు కార్య మిం
పౌనటు చేయగావలయు ♦ నాగిన గార్యముదప్పు నేమొ! నే
బూనెద సూక్ష్మరూపమిదె ♦ ముక్కిడి దైత్యుల గన్న బ్రామగన్.

(నిష్క్రమించును)

## ద్వితీయ రంగము.

### పాతాళలోకము—కాళికాలయము.

(దోర్దండి జలకలశంబున నాంజనేయు నిడి ప్రవేశించును.)

దోర్దం—ఆంజనేయా! మనగమ్యస్థానమును జేరితిమి! ఇదే కాళికాలయము. నీస్వస్వరూపము దాల్చి లోనికిన్ జని దేవి కెదురుగానుంపబడిన పేటికయందు దనుజమాయా మోహితులై పడియున్న రాజపుత్రులన్ గనుగొమ్ము. ఇక నే పనివినియెద.

ఆంజ—(స్వస్వరూపముతో ప్రవేశించి) సరే నీవు! పొమ్ము! నీవు చేసిన మేలునకు నేనెంతయు గృతజ్ఞుడను. (దోర్దండి నిష్క్రమించును.) ధన్యుడనైతి. రాత్రిమచంద్రుడు దున్న యెడకేగి యీదనుజకాంత సాయంబున రాక్షసులకు జిక్కకుండ జేరితిని. (ఆలయద్వారము దెఱచి పేటికను సమీపించి) ఇదే! పేటిక. (పేటికను దెఱచిచూచి) ధన్యోస్మి! ధన్యోస్మి! రామచంద్రా! సద్గుణసాంద్రా! కౌసల్యాగర్భజలధి రాకాసుధాకరా!!

శా॥ రామా! పావననామ! మానిహృదయా♦రామా! ననున్ జూడుమా
నీ మాటల్ విననేడుక య్యెడుగదా? ♦ నిక్కంబు ధాత్రీశ! ని
న్నీ వేసన్ గనవౌనటంచుమమది నే ♦ నెంచంగలే దక్కటా!
యీ మాయావిదుచేత జిక్కి యిట్లైతె ♦ తే రాజచూడామణీ!!

అహహా! దానవుని శాంబరీవిద్యాప్రభావంబుచే నొడలెఱుంగక నిశ్చేష్టులైయుండు వీని నెంత మేల్కొలిపిన నేమిలాభము. ఇంక కర్తవ్యమాలోచించుట మేలు.

ఉ. కంటిని రామచంద్రుని వె ♦ కార్యము నెంచకమున్నె యింకము
క్కంటియెదిర్చిన న్వెఱవఁ గష్టములన్ని తొలంగిపోయె నా
కొంటెను దానవాధముని గ్రొన్నడగించుటదక్కఁగాన నా
తుంటరి బచ్చెగాని విదె ♦ గ్రుంపఁగ యోజనసేయఁగావలెన్.

ఇంక దానవుని వధించుటకెట్లు చొప్పడు? పోనీ! రాజపుత్త్రులు సుఖులై యుండిరికదా! వీరిఁగొని చనిన— ఛీ! యివి యేటి మాటలు? అట్లయిన మైరావణునికంటె నాంజనేయుఁడే దొంగయని లోకులనఁగలరు? శ్రీరామచంద్రుని యనుగ్రహ మున్నచో యీదానవుండొక లెక్కయా? సచరాచరంబగు నీజగం బంతయు నొక్క క్షణంబులో భస్మంబొనర్పనే? (ఆలోచించి) నేనీదానవులతోఁ బోరుచుండిన మాయావిదుండగు దైత్యుండు వీరల కేదైన నపాయము కల్పనేమోకదా? అప్పుడేమి చేయవలసియుండును? (ఆలోచించి) భక్తజనవత్సల యగు నీదేవిఁ బ్రార్థించెదఁగాక! హే జననీ! ఇదే భగవంతుండగు రామచంద్రుండను జనితోఁగూడ దైత్యకృత మాయావాగురంజిక్కి విసిమింతుఁడై యున్నవాఁడు. ఈసమయంబున వీరిఁగావ నీదే భారము.

ఉ॥ తల్లిరో! నీప్రభావము వి ♦ ధాత్రుఁడు నైన మెఱుఁగజాలఁడు
త్ఫుల్ల సరోజనేత్రి! నినుఁ ♦ బూనిభజించినవారినెల్ల నీ
చల్లనిజూపులన్ దనిపి ♦ సర్వసుఖంబులనిత్తుగాదె సం
పల్లలితాంగి ప్రోవుమిఁక ♦ భావమునందు దలంతు గాళికా!

**మఱియు—**

ఉ. మొక్కలుఁడైన రక్కసుఁడు ♦ మ్రుచ్చిలిదెచ్చెను వీరిదాఁట నీ
నక్కటికంబుమాని నుప ♦ హారిమొసంగఁగ నంతెగాదె నే

మత్కృపవమిాఱ నీకిపుడు ♦ మానుగ రక్కసిశ్రేణితోడ నీ
రక్కసిమూకనంతయును ♦ రమ్యగతిన్ బలియిత్తుజూడుమా!

కావున నీకు బలిదానంబు సమకూర్చునెడ వీరినిర్వుర శత్రువులకుం జిక్కకుండ నీరక్షణక్రిందనునిచి కాపాడవేడెద.

కాళి—ఆంజనేయా! రామభక్తుడవై రామకార్యార్థివై యేతెంచిన నీవు మాకెంతయుమాన్యుండవు. కావున వీరినిం నేగాపాడుచుండెద. నీవరిగి దానవులవధియించి విజయుండవై రమ్ము. పొమ్ము.

ఆంజ—మహాప్రసాదము. ఇప్పటికి కృతకృత్యుండనైతి. రాజపుత్రులు సురక్షితులైరి. ఇంక సన్నద్ధుండనై దానవులపై కరుగవచ్చు.

శా॥ ఓహో! దానవులార! మీావిభుడు గ♦ర్వోన్మత్తుడై చోరతన్
ద్రోహస్వాంతముతో రఘూద్వహులం దా♦దోడ్తెచ్చెగా? మున్నె నే
బాహాటంబుగ వారినిర్వుర నిదే ♦ వైళంబ గొంపోయెదన్
బాహాబాహి దేక మెలర్ప నష్టపడుడీ ♦ వారింపగాం గల్గినన్.

ఆవీరాలాపంబుల నాలకించి యూర్ధ్వజస్థంభము నొద్దగాపుండిన రక్కసులందరుం గలవరమొంది యీాదెసకే వచ్చుచున్నారు. ఏకితో నీవిషమతలంబున బోరుటకంటె నాసమతలంబున బోరెదంగాక. (అని నిష్క్రమించును)

—♦ తృతీయ రంగము ♦—

రంగము—పాతాళలంక

[లంబకర్ణుని ప్రవేశము]

లంబ—నేటికి బదునైదుదినములక్రిందట దేవిగారి యానతిచొప్పున నామెజనకుని గృహంబునకరిగితిని. ఇచ్చటి విశేషంబులేమియు దెలియవయ్యె. ఇచ్చటివిధంబునుజూడ నెద్దియో సమరం బొనంగూడినట్లు తోచుచున్నది. ఎవ్వరినిజూచినను నాయుధంబులం బూని యటునిటు పరుగెత్తువారుగానుండిరి. అల్లదె! రక్క

సుల సింహనాదంబులు. తప్పకేదియో సంగరంబు తటస్థించినట్లు తోఁచుచున్నది. ఎవరిని బుఱకరించినను నొక్కరుఁ బలుకకుండిరి! ఎవ్వరితో నీసమరము సంభవించెనో? దేవతలందరిదివరకే మా మహారాజుగారిచే నోడింపఁబడిరికదా! తిరుగ వారెన్నటికి రాఁజాలరు. అల్లదె! ఎవఁడో తల విఱియఁబోసికొని రోఁజుచు నీవైపునకే పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. వీనివైఖరిఁజూడ యుద్ధభటునివలెఁ గాన్పించుచున్నాఁడు. వీని నడిగి తెలిసికొనెదఁగాక (పరికించిచూచి) ఎవరోయనుకొంటిని మాపంచజనుఁడే (అప్పుడు రోఁజుచు తల విరియబోసికొని ఖడ్గము చేతఁబట్టుకొని పంచజనుఁడు ప్రవేశించును)

లంప—ఓరీ! పంచజనుడా! ఏల రోఁజుచువచ్చుచున్నావు?

పంచ—ఉండు. ఇప్పుడుకాదు (అని పోబోవును)

లంబ—(చెయ్యిఁబట్టుకొని) ఆఁగు నీవెచ్చటనుండి వచ్చుచున్నావు? ఏమివిశేషము జరుగుచున్నదో చెప్పు. నేను యీమధ్య గ్రామములో లేను.

పంచ—వదలు నేను యిప్పుడేపోయి మన మహారాజుగారితో మన వ్యాఘ్రదత్తుని మరణవార్త నెఱింగింపవలయు.

లంబ—ఏమీ! మన వ్యాఘ్రదత్తుని మరణవార్తయే? అతఁడెట్లు మరణించెను.

పంచ—నీవ్గ్రామములో లేవా? ఎచ్చటికరిగితివి?

లంబ—లేను! దేవిగారి పనుపున నామేజనకుని గృహమునకు.

పంచ—అట్లయిన చెప్పెదవినుము. మన మహారాజుగారు నిన్నటి రేయి యెచ్చటినుండియో వృద్ధబుసరులను మన కాళికాదేవికి బలియిచ్చుటకై తెచ్చి వారినిర్వురను గాళికాలయంబున నునిచి నేటియుదయంబున బలియిచ్చుటకు నిశ్చయించెను.

లంబ—నరులనా? బలియిచ్చుటకా? ఏల? ఎవరువారు?

పంచ—ఏమో అదంతయు నాకుఁ దెలియదు. వారిపేర్లు రామ లక్ష్మణులఁట.

లంబ—సరే! అటుపిమ్మట!

పంచ—ఇదియిట్లుండ నేటియుదయంబున నెచ్చటినుండియో యొక కోఁతి మనవీఁడుసొచ్చి యెవ్వరికిన్ గనుపడకుండ కాళికాలయంబునన్‌సొచ్చి యందున్న నరుల నిర్వురను దాచి యంతి విజృంభించి మనరాక్షసవీరుల ననేకుల వధియించెను.

లంబ—(ఆశ్చర్యముతో) కోతి మనరాక్షసవీరుల ననేకులఁజంపెఁగా?

పంచ—కోఁతియనబోకు! వాఁడెక్కడకోఁతి ధ్వజస్తంబమునొద్దఁ గల రాక్షసవీరుల దొంబదికోట్లమందిని సంహారించె. ఇంక ఘటిక, సుచర్మిక, వ్యాఘ్రముఖ జిత్తాది మంత్రులను, తక్కిన దండ నాథులను మడియించె. మహారాజుగారొక్కరు మాత్రము మిగిలియున్నారు.

లంబ—అయ్యో! మంత్రులందరు నశియించిరే! దేవతలతోఁ బోరు నప్పుడైన ని తమంది చావలేదే! వీఁడు వానరుఁడుగాఁడు. ఇది యేదోమాయగానున్నది.

పంచ—కాకపోయిన మనమిదివరలో వాలి మొదలయిన వానరులను జూచియుండలేదా? వారిపరాక్రమములను వినియుండలేదా? వారికింత బలపరాక్రమములెక్కడివి?

(తెరలో) ఓరోరి! తుచ్ఛదానవులారా! పాఱకుఁడు.

ఉ॥ పాఱెదరేల? భీతిమెయిఁ ♦ బ్రాణము లింతటితోఁ జెనే?
దారుణభంగి జీవతతి ♦ దద్దయు మున్నటు మ్రింగినప్పుడీ
తీరుఁ దలంపఁగూడదొకో ♦ తేకువవీడి తొలంగినంతనే
దీరునె మీకు మృత్యువది ♦ ధీరతనిల్చుడుపాఱిపోకుఁడీ!!

పంచ—(వణకుచు) వింటివా! ఆవానరాధముని కంఠధ్వని!

లంబ—పిడుగుబోలిన యీకంఠధ్వని వానిదేనా?

పంచ—అదిగో! ఈవైపునకే వచ్చుచున్నాఁడు.

లంబ—అయ్యో! ఏమిగతి. మనమీవైపునకు బరుగెత్తుదము పద! (నిష్క్రమింతురు)

(ఆంజనేయుఁడు "పాఱెదరేల" అను పద్యముచదువుచుఁ బ్రవేశించును.)

ఆంజ—(వీరావేశముతో) ఎఁడీ! ఒక్కదానవాధముండును గాన్పింపఁడే? వీరునుఁగూడముందు వారిమార్గమునే యనుసరించిరి. కాకున్న నీపిఱికిపందలా! నన్నుఁజయించునది? ఇప్పటికిఁ బేరుగల్గిన దానవవీరులందరును మడసిరి. వీరును రావణుని లంకయందలి రక్కసులకెందును దక్కువకారు. ఇప్పుడు నాచేమడిసినవ్యాఘ్రముఖుని పరాక్రమ మత్యంతప్రీతిజనకమైయున్నది. మున్నింద్రజిత్తాదులతోఁ బోరినప్పుడుఁ గూడ నీ లాఘవలక్ష్యశుద్ధులచ్చటఁ గానఁబడలేదు. (తెరలో గలకలము) ఏమిటీకలకలము తిరుగ దానవుండెవ్వఁడైన యుద్ధంబునకుఁ గడంగెనా? వచ్చిన నింకెవ్వరువత్తురు? నారాక్షసాధముండగు మైరావణుండే రావలెను. కానిమ్మెవ్వరు వచ్చిననేమి?

(తెరలో) ఓహోహో! దానవవీరులారా! ఏల యీరీతి భయవిహ్వలులై పాఱెదరు. నిలుండు నేనిదేవచ్చుచున్నాను.

శా॥ ఏమీ? దానవులార! మీర లిటు ♦ మున్నింద్రాదులన్ గెల్చుసం
గ్రామోత్సాహములెల్ల వీడి యనిబా ♦ ఱన్ జెల్లునే? వైరిమీ
సామర్థ్యంబులఁజూచి నవ్వఁడొకో మీ ♦ శౌర్యంబులేమాయె? ని
స్సీ! మీకేటికి పాఱిన్నసడి వి ♦ స్ఫీతంబుగాఁబోరుఁడీ!!

ఆంజ—వీఁడే మైరావణుఁడు. రానిమ్ము వీనిపనిఁ బట్టించెద.

(మైరావణుఁడు పంచజనుఁడు ప్రవేశింతురు.)

మైరా—ఓరీ! పంచజనుఁడా! వీఁడెనా యావానరాధముఁడు.

పంచ—చిత్తము దేవా! వీఁడే యావానరాధముఁడు.

మైరా—(ఆంజనేయుని దిక్కై) ఓరోరి! వానరాధమా?

ఉ॥ ఎవ్వఁడవీవు? ఏమిపని ♦ కిచ్చటకున్ జనుదెంచినావు ని
న్నెవ్వరు బంపినారలిటు ♦ లేటికిఁ జంపితి నాదుసైన్య మిం
దెవ్వరు నీకుఁగూర్తురిపు ♦ డింతయుఁ దెల్పుము దెల్పవేని నీ
క్రొవ్వఁడగించి ప్రొద్దుకొమ ♦ రుఁడు వసించెడిచోటి కంపెదన్.
నిక్కంబించుకైన దాపకుండ నెఱింగించిన నినుమన్నించెద.

ఆంజ—ఓరోరి! నిశాచరాధమా! నీవా నన్ను మన్నించువాఁడవు?

చ. దనుజకులాధమా! వినుము ♦ తస్కరరీతినిఁ జొచ్చి మాయచే
దినకరవంశవర్యులను ♦ దెచ్చుట లిచ్చట సాగవింక మ
త్స్వనిశితవాలరోమమున ♦ జుట్టి జగంబులు విచ్చలింప స
వ్వనజభవాదులద్భుతపడ ♦ వచ్చినఁ జంపెదఁ గాచికొమ్ముకన్.
అయినను నాకులగోత్రంబు లడిగినప్పుడు జెప్పకుండుట పాడి గాదుగావునఁ జెప్పెద వినుము.

చ॥ తడిగితివీవుగాన విను ♦ మంజనికిన్ ప్రియనందనుండ! నా
యొడయఁడు రామచంద్రుఁడు! మ ♦ దోద్ధతి నాతని దెచ్చువిన్న వే
మడియఁగఁజేతుఁ బేరు హను ♦ మంతుఁడు మాటలిఁకేల? రోరి! నీ
దుడుకుఁదనంపుఁ బోకడలఁ ♦ ద్రుళ్ళడఁగించెద సంగరంబునన్.

మైరా—ఏమీ! నీవా! నాత్రుళ్ళడఁగించునది!

శా॥ ఓరీ! యెంతటివింతఁగాంచె నిపుడా ♦ హా! వానరుల్ శూరతన్
ఘోరాజిన్ సురవైరివీరుల వెసన్ ♦ గూల్పంగ మున్నెన్నఁడీ
తీరుల్ జూడఁగలేదు మేమెచట నీ ♦ కీకోస్తులింకేల? నో
శూరమ్మన్య! చలింపకింక నిలుమీ ♦ గోరుంపవే న్యైనచోన్.
మఱియు.

ఉ. చోరునిరీతి నాపురిము ♦ జొచ్చితి వంతటఁబోక దేవికా
హారము సేయఁదెచ్చిన న ♦ రాధములన్ గొని డాఁచినాఁడవీ

బీరములేలబల్కెదవు ♦ భీతిఁ దొలంగక నిల్వుమింక నీ
శూరతయెట్టిదో గనెదఁ ♦ జూపఁగరమ్మిఁక వానరాధమా.

ఆంజ—నిజము.

శా॥ ఔనా! వింతగఁదోఁచు నీకిపుడు ముం ♦ దాలంబునం దద్దశన్
బ్రాణంబుల్ వెసఁగోలుపోవునెడలన్ ♦ భావంబునం దెంతువో!
కీనా శాధమ! మద్బలంబుఁ జలమున్ ♦ గేడించుచే? మమ్ములన్
కానీ! చూచెదవీవనేచరుని వి ♦ క్రాంతింక యుద్ధంబునన్.

మత్తకోకిల.

పాటిపోకుము నిల్వుమింకను ♦ పల్కెదవు బీరముల్
చోరుఁగీతిని రాముఁ బెచ్చెడి ♦ చొప్పులిచ్చట సాగునే
వీరు లెవ్వరు వట్టిమాటల ♦ వేరమిఁగఁ దలంతురే?
మోసమెత్తి మెఱుఁగు కుక్కది ♦ ముద్రిచ్చునెప్డు గలంమనే?

మైరా—ఓరోరి వనేచరాధమా! ఎంతవాఁడవైతివి?

ఉ. నీవిటు కండక్రొవ్వున గ ♦ ణింపక నన్నుఁ దృణీకరించెదే
నీవనసెంత దేవతలు ♦ నిక్కము నన్నుఁ గెల్వఁజాల రా
రావణుఁడంచు సెంచితివొ! ♦ రజ్జులుప్రేలితి వింక వీఁడు మై
రావణుఁ డీలెనిక్ జెనక ♦ రాదువనిూ హరికైన నానరా.

ఉ. అంజలిఁజేసి నేగశర ♦ ణార్థిని నన్నుకఁ బ్రోవుమన్న నీ
యంజకఁదీర్చి ప్రోచెద న ♦ హంకృతితోడ మెలంగితేని వే
భంజనసేతు నాలమున ♦ భర్గుఁడు తోడయివచ్చెనేనియుఁగా
గొంజక వేఁడు మట్లయినఁ ♦ గోపముపేడి త్యజింతు నాజిలోఁగా.

ఆంజ—ఓరోరి! విశాటా! ఏమంటివి?

చ॥ శరణని వేఁడు మాయన ని ♦ శాచర సిగ్గది యోలలేదు నీ
కరయుఁగ సొదరీగతిం ♦ గావనిఁగూలిరి రాక్షసాధముల్
గరువముపేడి నీవిటు ♦ గన్గొనివైనను జావునందు సు
స్థిరముగుపూన్కితోడ నరు ♦ దెమ్మిఁక బీరములేల పల్కఁగా.

రావణునికంటె నీవుమాత్ర మెక్కుడువాఁడవా?

సుగంధి.

ఏరివారి మాటలేల ♦ బీరమున్న చిమ్ముఁడిఁకన్
పాఱుబోతుఁ దనముదోఁపఁ ♦ బల్కనేల బీరముల్
పౌరుషంబు జూపినన్ను ♦ పారఁదోలి తేనియుఱ్
శూరుఁడంచు నిన్ను మెత్తు ♦ జుల్కఁజూతు లేనిచోఁ.

మైరా—(కోపముతో)

సుగంధి.

వారివీరి కూల్చితంచు ♦ పల్కనేల కోరి నీ
బీరమంత నేటఁగల్పి ♦ విల్కుమూర్తు నాజిలో
నూరకింక ప్రేలనేల ♦ నుక్కడింతు నిన్నిదే
పాటిపోక నిల్వుమింక ♦ పాఱుబోతువానరా.

అల్లదే! ఆసమస్థలమునఁ బోఁగాదమురమ్ము.

చతుర్థరంగము—కాళికాలయము.

[ఆంజనేయుఁడు ప్రవేశించును]

ఆంజ—ఆహా! ఇది యేమి చోద్యము? ఈదానవు నెన్నిమాఱులు వధించినను వెనువెంట సజీవుఁడై యుద్ధమునకుఁ గడంగును.

ఉ॥ అక్కట చోద్యమయ్యెడిని ♦ నాహవమందిటు లెన్నిమారులీ
రక్కసు నుక్కడించినను ♦ గ్రమ్మఱ జీవమువచ్చి లేచునా
కక్కజమయ్యె నీవిధ ♦ మారసిజూచిన దీని మర్మమిం
కక్కట దెల్పువారెవరు? ♦ హా! యిఁక నీనివధించుటెట్లొకో!

సకలదానవ మర్మవిదుండగు విభీషణుఁడైన నిచ్చట లేక యున్నాఁడే! అతఁడు చెప్పినదంతయు నిక్కువంబ. వీఁడు సంగరంబునఁ జావఁడు. దీనికేదయిన మర్మముండితీఱవలయు. దాని

నెఱిఁగింపువారెవరు? (ఆలోచించి) భక్తాభీష్టప్రదాయనియగు నీకాళికనడిగెద హే! జగజ్జననీ!

ఉ॥ తల్లిరో! నీ వెఱుంగని యు ♦ దంతము లీ భువనంబులందు లే
వెల్లజగంబులన్ గరుణ ♦ నేలెడి మేల్దొరసానివీవ నీ
ప్రల్లదుఁడిట్లు చావమికిఁ ♦ బ్రాణములీగతి వచ్చుచుంటకున్
దెల్లముగాఁ గతంబెఱుఁగఁ ♦ బల్కుము వేడెదనమ్మ శాంకరీ॥

కాళి—ఆంజనేయా! ఈరక్కసుండు తపంబాచరించి పరమేష్ఠిన్ బ్రసన్నునిఁ గావించుకొని సంగరంబునఁ జావులేకుండఁగను వరంబుఁబడసి తన తపోమహాత్మ్యంబున దన ప్రాణంబులైదింటిని నైదుభృంగంబులుగా నొనర్చుకొని సప్తసముద్రంబుల కవ్వలనొక తాళవనంబునందొక వల్మీకంబున నొకబరిణెయందునిచి సురక్షితంబుఁగావించె. ఈదానవునికిఁ దిరుగ జీవంబులువచ్చునంతలో నవరికి యాభృంగంబులు బరిణె గొనివచ్చి వీనిపై నునిచి యాభృంగంబుల వధించితివ యేని వీడంతంబునొందు. గాన సత్వరంబయట్లుగావింపుము. నేను మేలయ్యెడిని. (అనియంతర్ధాన మొందును)

ఆంజ—అహో! ఈదానవుని చాతుర్యము. ప్రాణంబులైదింటిని తుమ్మెదలుగావించి సప్తసముద్రంబుల కవ్వల నొరులెఱుంగకుండ దాచెఁగా! ఈదేవి నెఱిఁగింపకున్న నీనివధియించుటకు సాధ్యముగాదు. నేనిప్పుడే సముద్రుండను. వీనినిచ్చటనే డించి యేనేగిన సజీవుండై యుండకేమియొనర్చునో? గాన వీని మచ్చ ణంబులకుఁగట్టి గొంపోయెద. ఇంక నాలసించినఁ గార్యంబుఁ జెడును. ఇదేపోయెద. (తెరపడును)

—* పంచమరంగము. *—

(ఆంజనేయుండు చేతనొక బరిణను ధరించి కాళికి మైరావణుని గట్టుకొని ప్రవేశించును.)

ఆంజ—ఇప్పటికిఁ గార్యసాఫల్యమైనది. ధన్యుఁడనైతి. ఈదానవుం డింకను సజీవుండు కాలేదు. (కాలికట్టువిప్పును. మైరావణుండు లేచును.)

మైరా—ఓరోరి! వానరాధమా! నిలునిలు! నిన్నీపటి యంతమొందించెద.

ఉ. ఓరి వనేచరాధముఁడ! ♦ యోరి దురాత్ముఁడ! యోరిద్రోహి యీ
సారి నినుం వధించెదను ♦ సాగవు ముందటిరీతులింక నీ
తీరున నింతపట్టులిటు ♦ ధీరత నిల్చితి సంతసించితిం
శూరుఁడవైన నిల్వుమికఁ ♦ జూపెద నీకిదె మత్ప్రతాపమున్.

(అని సమీపించి చేతియందలి బరిణెఁజూచి తనలో) అక్కటా! ఇఁకేఁ జచ్చితిని. వీనికీమర్మ మెవ్వరు చెప్పిరో! ఈతెఱఁగు నాకుఁదక్క నింకొరులకు దెలియదు! వీనికెట్లు దెలిసెనో! ఇంకేదిదిక్కు! పుట్టిననాటనుండి నేనొనర్చిన దుండగంబుల కిదియే తుదికాఁబోలును? ఈ లేనిపోని కలహంబు నేనేల తెచ్చి పెట్టుకొనవలె. నాప్రియసతి నాకెంతయో బోధించెనుగదా? ఆమెపల్కులు కూడ పెడచెవిం బెట్టి యీమమిక్కిలి యామె ననరాని మాటలంటినే! ఆమెమనసెంత నొచ్చెనో? ఇప్పు డేమిసేయుదును? వీని నేవిధంబున మాయఁజేతును. (ప్రకాశముగా) వానరవర్యా! నీపరాక్రమము నాకెంతో యాశ్చర్యముఁగల్గించుచున్నది. నిక్కముగ నీతోఁ బోరవలెనను నుత్సాహములేదు. ఇంతటి పరాక్రమవంతుఁడవైన నీతో నెయ్యమొనర్ప నామనం బుత్సహించుచున్నది. నీకేమి కావలయునో చెప్పుము. శీఘ్రంబున నొసంగెద. నీకును నాకును వైరంబుతోఁ బనిలేదు.

ఆంజ—(తనలో) ఓహో! ఏమీ! ఈదానవుని నక్కవినైచ్యములు· తనకవసానకాలము సమీపించినదని నిశ్చయించుకొని నాచేతి

యందలి బరిణెనుగాంచి దానినెట్లైన మాయచేత హరియింపనెంచి యీప్రసంగమునకు దిగినాఁడు. కానిమ్ము తలంచిన కార్యంబుచెదును. (ప్రకాశముగా) ఓరోరి! నీచా! నీమాయలింద్రజాలంబులిదివరకే యంతరించె. ఇంకను మాయఁజేయనేల యుంకించెదవు. ఇదివరకొనర్చిన దుండగంబులు చాలవా! దేవతలను హింసించుటా! మునులను బాధపెట్టుటా! స్త్రీలను చెఱఁబట్టుటా! ఇవియవి యననేల! నీవొనర్చని దుష్కృత్యంబులెచ్చటను గానరావు. ఇట్లు ప్రతిజీవ భయంకరుఁడవై కాలంబు జరిపితివిఁక నీయంత్యకాలంబాసన్నమైనది. గాచికొమ్ము. నీచే హింసింపబడిన జీవరాసులన్నియుఁ దమకసిఁదీర్చుకొనటకై గాచికొనియున్నవి! ఓరీ! తుచ్ఛుఁడా! ఇప్పడైన నీయంతరాత్మ నిన్నుఁబీడించుచుంటుట లేదా! అజన్మ ప్రభృతియెన్నఁడును దలఁపని భగవంతుని యిప్పడైన దలంపుము. ఇదేసిద్ధముఁగమ్ము

[అనిజుట్టుపట్టి పడవైచి గుండెలపైఁ గూర్చుండి బరిణెలో తుమ్మెదల నలుపును, తెరపడును.]

పంచమాంకము సంపూర్ణము.





శ్రీ

శ్రీ కాకుళగమణసహాయం.

శ్రీ ఆంజనేయస్వామినేనమః.

# మారుతివిజయము.

—* షష్ఠాంకము. *—

రంగము—పాతాళలోకము.

(రాముఁడు, లక్ష్మణుఁడు, యాంజనేయుఁడు ప్రవేశింతురు.)

రాము—వత్సా! ఆంజనేయా! మేమిప్పు డెచ్చటనుంటిమి?

ఆంజ—దేవా! విన్నవించెద. తమరిట్లు నాటిరేయి పేటికయందుం చఁబడి కాపఁబడుచుండ మైరావణుండు మిమ్ములఁ గికురించి మిమ్ము మాయచే మోహితులఁ గావించి యిచ్చటికిఁ గొని తెచ్చె.

రాము—ఏమీ! వాఁడు మమ్ములఁ గొనితెచ్చెనా? తరువాత.

ఆంజ—తరువాత నేను విభీషణునిచేఁ దెలుపఁబడి కొంతవడి శోకించి యవ్విభీషణునిచే దెలుపఁబడిన మార్గంబున నీపాతాళలంకఁ జేరితిని.

లక్ష్మ—ఇప్పుడు మనమున్నది పాతాళలంకయా?

ఆంజ—చిత్తము. అట్లీలంకఁ జేరి మైరావణుని చెలియాలగు దోర్దండి తోడ మైత్రిఁ జేసికొని సూక్ష్మరూపంబున నామె జలకలశ

బున జేరి ముందు మిమ్ముల నా దైత్యాధముండు బలినొసంగుటకై సిద్ధమొనర్చియుంచిన కాళికాలయంబుఁ జేరి యాదేవిఁ బ్రసన్నురాలనుగాఁ జేసికొని మిమ్ముల నాదేవి రక్షణక్రింద నునిచితి.

రాము—ఔరా! ఆ రాక్షసుని మాయ! ఇంతయొనర్చినను మేమెఱుంగఁ జాలమైతిమి. పిమ్మట?

ఆంజ—అటుపిమ్మట విజృంభించి యీలంక యందలి రాక్షసుల నెల్ల సంహరించి తుదకు మైరావణునిఁగూడ నంతమొందించితిని.

రాము—ఆంజనేయా! నీవొనర్చిన యుపకృతికి విలువయెక్కడిది?

ఉ॥ నీరదవర్ణ్య! నీ ఋణము ♦ వేయిభవంబులనైన దీర్పఁగా
భారము గాదె మారుతయ ♦ భానుకులంబున కెల్ల నీవె యా
ధారము నీ వొనారితము ♦ ధారుణి మాయెడఁ జూపు ప్రేమకున్
మేర దలంప నెక్కడిది ♦ మేలిటు మెచ్చితి వానరాగ్రణీ!

ఆంజ—దేవాదిదేవా! శ్రీరామచంద్రా! ఏల యీరీతి మాయఁ జేసెదవు?

చ॥ మనుజవరేణ్య! నీవరయ ♦ మానవమాత్రుఁడవే దలంప న
వ్యాసమహాగరిష్ఠ ముఖ్యసుర ♦ వందిత పాదసరోజుఁడైన నా
వనజభవాద్యు సంతతము ♦ వారక జన్మము సందినాఁడ వీ
దనుజులఁ ద్రుంచుటెంతపని ♦ దారుణినాయక నీకుజూడఁగన్.

మఱియు

చ॥ అనఘచరిత్ర! నీవు జయ ♦ మంతయు నాకొడఁగూర్ప నెంచి యీ
యనువున మిన్నకుంటివని ♦ యాత్మఁదలంచెద నట్లుగానిచో
మనుకులవర్య! యీజగము ♦ మన్పఁగఁ ద్రుంపఁగఁజాలు నీవు చ
య్యనఁగనువిప్పిచూడ దను ♦ జాధముమాయలు నిల్వనేర్చునే.

సకలజగజ్జాలంబులను నీమాయచే మోహితంబులుగా నొనర్చు

రాము—నిజము లక్ష్మణా! నిజము. ఈ మహాత్ముని యవ్యాజకారుణ్యము చేతనే మనకి తివఱ కెన్నియో యాపదలు వచ్చినను సులభముగాఁ దప్పిపోవుట తటస్థించినది.

(సుమతి యాంజనేయుఁడు ప్రవేశింతురు)

ఆంజ—వత్సా! సుమతీ! అదిగో! శ్రీరామచంద్రమూర్తి! దర్శన మొనర్చి జన్మసాఫల్యతఁ గాంచుము.

సుమ—చిత్తము (తనలో) ఆహా! ఏమీ! నా భాగ్యము.

మ॥ అరయన్ బ్రహ్మభవాదు ♦ లెల్లరను నత్యంతంబుఁ జింతించియే
పరమూర్తిన్ గనఁజాలరట్టి ఘనునిన్ ♦ బద్మాక్షు లక్ష్మీపతిన్
సురవంద్యున్ మహిమాననాబుజహసున్ గేశవున్ రాఘవున్
గురి మేరన్ గాంచఁగల్గితి నా ♦ భాగ్యంబు సామాన్యమే?

ఇట్టి మహానుభావుని దర్శన మొనర్చి నా జన్మము ధన్యమొనర్చుకొనెద. (ప్రకాశముగా) హా! రామచంద్రా! శరణు. శరణు.

శా॥ ఓ కాకుత్స్థకులాబ్ధిపూర్ణశశి! ♦ యో భానువంశాగ్రణీ!
యో కోదండకళాప్రవీణచతురా? ♦ యో భక్తకల్పద్రుమా!
యో కాంచనభవాబ్ధితారకపదా! ♦ యో జానకీవల్లభా!
నా కాదారి ... దేహ్యము సనున్ ♦ నిన్వేడెదన్ రాఘవా.

(అని పాదములపై బడును.)

రాము—(లేవనెత్తి) వత్సా! నీభక్తికి సంతసించితి. నిష్కలంకరాజ్యంబునకుఁ బట్టభద్రునిఁ గావించెద. ఆచంద్రతారార్కము మన్నామంబు జపియించుచు న్యాయంబుఁదప్పక ప్రజల బాలింపుచుండుము. దేవబ్రాహ్మణులయెడ నత్యంతభక్తితో మెలంగుము. ఆంజనేయా! భాగవతీజలంబులఁ దెమ్ము. (ఆంజనేయుఁడు నిష్క్రమించి జలకలశంబుతోఁ బ్రవేశించును. రాముండు కలశంబు నందుకొని సుమతిపైఁ జల్లును.) వత్సా!

నిన్ను లంకారాజ్యంబునకు నధిపుంగావించితిని. నీకేమి కావల యునో వేఁడుము.

సుమ—దేవా! ఇంకను గోరఁదగిన దేమికలదు? పురాణపురుషుండ వైన నీదర్శనభాగ్యంబు లభించె. నాకింక గోరఁదగినదేమి యును లేదు. అయినను నిట్లగుఁగాక.

తే॥ గీ॥ ధరణి న్యాయంబుఁదప్పక ధరణిధవులు
పాలనము సేయుదురుగాత ♦ ప్రజలనెల్ల
నవని సస్యాఢ్యయై కడు ♦ నలరుఁగాత
క్షామరోగంబు లెల్లెడ ♦ సమయుఁగాత.

రాము—తథాస్తు! ఆంజనేయా! మనకొఱకు సుగ్రీవాదు లెదురు చూచుచుందురు. పోదము పద.

ఆంజ—చిత్తము. (అందరు నిష్క్రమింతురు.)

ఇది శ్రీకాళహస్తీశ్వరమణ వరప్రసాదసమాసాదిత కవితావిచిత్ర
సర్వసుధీజనమిత్ర, కోపల్లెవంశపయఃపారావారరాకా
సుధాకరాయమాన, కోదండరామయామాత్యాభిదాన, సుధీ
మణిపుత్రరత్న, వేంకటరత్నాభిధేయ ప్రణీతం
బైన మారుతీవిజయ మను దృశ్యప్రబంధం
బున షష్ఠాంకంబు సర్వంబును
సంపూర్ణము.

శ్రీకాళహస్తీశ్వరమణార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 9 | వడమెక్క | వొడమెక్క |
| 2 | 7 | వేడమని | వేడుమని |
| 1 | 14 | శుపార్శ్వ | సుపార్శ్వ |
| 3 | 1 | కౌస్తువంబు | కౌస్తుభంబు |
| ,, | 2 | మైరావతి | యైరావత |
| ,, | 15 | మదీప్సతంబె | మదీప్సితంబె |
| ,, | 17 | దుస్యాధ్య | దుస్సాధ్య |
| 4 | 16 | సంగ. | సార. |
| 7 | 14 | సోమ్మసిలి. | సొమ్మసిలి. |
| ,, | 16 | పఱాక్రమంబు | పరాక్రమంబు |
| 9 | 7 | సమయంబుస. | సమయంబున |
| 10 | 24 | చెల్లెలుపై | చెల్లెలిపై |
| 15 | 5 | సువేలాచలపర్వతము | సువేలాచలము. |
| 17 | 3 | నాయుద్ద | నాయొద్ద |
| 18 | 22 | పట్టిపట్టినపట్టు | పట్టినపట్టు |
| 18(B) | 4 | తాటకదమనాయ | కాటకాదమనాయ |
| 18(B) | 10 | తుభ్యనమోస్తు | తుభ్యన్నమోస్తు |
| ,, | 11 | ,, | ,, |
| ,, | 13 | ,, | ,, |
| 18(D) | 11 | కొవ్వి | క్రొవ్వి |
| 18(D) | 21 | కెఱగించె | కెఱిగించె |
| 21 | 7 | పచ్చెదు | వచ్చెదు |
| ,, | 9 | చేయుట | జేయుట |

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 31 | 1 | నిరూవముల్ | నిరూపముల్ |
| 32 | 21 | సాత్రివ | శాత్రివ |
| ,, | 23 | కాచెద | క్రాచెద |
| 37 | 9 | జైత్యాళి | వైత్యాళి |
| 39 | 10 | సోపానముల్ | సోపానముల్ |
| 41 | 7 | పాతళలోకం | పాతాళలోకం |
| 42 | 7 | వృద్ధినొందంగ | వృద్ధినొందంగ |
| 59 | 13 | జీరెదుపనికి | జీరెడుపనికి |
| 69 | 12 | నచరాచర | సచరాచర |
| ,, | 26 | వీఁదాకునీ | వీఁనీకుదా |
| 70 | 14 | ఆవీరాలాప | నాపీరాలాప |
| 72 | 12 | మడియింఙె | మడియించె |
| 75 | 11 | వేరమిాగ | వైరమిాగ |
| ,, | 22 | విశాటా | నిశాటా |
| 76 | 4 | వీరముల్ | బీరముల్ |
| 82 | 10 | నిర్భాధ | నిర్బాధ |
| ,, | 23 | దిని ప్రాణముల్ | దిని బడి ప్రాణముల్ |
| 84 | 15 | యాభిదాన | యాభిధాన |